# రామ్, శ్యామ్

పార్లే

## చూపిన సమయస్ఫూర్తి

























నోరూరించే. మనసుదోచే. మైమరపించే.

everest/86/PP/413-tl

# ఇప్పుడు! సెరిలాక్ లాభాన్ని డబ్బు ఆదా చేసే రీఫిల్ ప్యాక్ ద్వారా పొందండి

ఆధునికమైనది. అనువైనది




4 నెలల నుంచి మీ పాపాయికి. పాలతోబాటు అదనంగా ఘన పదార్థాలు కావాలి. పాపాయికి సెరిలాక్ లాభంతో దీనిని ప్రారంభించేందుకు యిదే సరైన సమయం. ప్రతి సెరిలాక్ మోతాదులోను పోషక పదార్థాలన్నీ పూర్తిగా ఉంటాయి. పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం. సెరిలాక్‌ని తయారు చేయడం కూడా ఎంతో సులువు–దీనిని ముందుగా కాచిన వెచ్చటి నీళ్ళలో కలిపితే చాలు. సెరిలాక్ మీరు ఎంచుకునేందుకు మూడు రకాలను సమకూరుస్తోంది–సెరిలాక్ వీట్. వీట్-ఆపిల్. వీట్-ఆరంజ్.

ప్రతి బ్యాగ్‌ని గాలి చొరబడకుండా సీలు చేయడం ద్వారా రీఫిల్ ప్యాక్‌లోను సెరిలాక్ వీట్ మంచితనాన్ని చెక్కు చెదరకుండా కాపాడతారు. తరువాత దానిని బయటి పెట్టెలో ప్యాక్ చేస్తారు. ప్రతి రీఫిల్ ప్యాక్ కూడా నెస్లె వారి నాణ్యత హామీతో లభిస్తుంది.

సెరిలాక్‌ని తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు. మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు ప్యాక్ మీద ఉన్న సూచనలను జాగ్రత్తగా పాటించండి. రీఫిల్‌ని తెరిచిన వెంటనే అందులోని పదార్థాన్ని. గాలి చొరబడని డబ్బాలోకి మార్చండి.

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




R K SWAMY/FSL/5340 TEL


ఆంప్రో మిల్క్ బేస్
బడిపిల్లల
బిస్కట్
ampro
Milk Base
Sista's-EIPL-97/88 Tel.A
పాలలోని పౌష్టికత పరిపూర్ణంగా గలది.




# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ ["ప్రతిజ్ఞాభంగం"]కు ఆధారం, మల్లవరపు మనోహరరెడ్డి రచన. ఆత్మస్తుతీ, పరనిందా మనిషికుండగూడని అవగుణాలు. పరోపకార బుద్ధీ, ప్రలోభాలకు లొంగకపోవడం అనేది, మనిషికి నైజగుణం కావాలి. కాని, కొందరు కేవలం యితరుల నుంచి మెప్పు పొందేందుకు, ఎంతో ఉదారుల లాగా, నిగ్రహశక్తికలవారిలాగా ప్రవర్తిస్తారు. ఇందుకు ఉదాహరణ ''పిశాచాల సందేహం'' అన్న కథ.

## అమరవాణి

ఉత్తమే తు క్షణం కోపో, మధ్యమే ఘటికాద్వయం,
అధమే స్యాదహోరాత్రం, చండాలే మరణాంతికః.

[ఉత్తములకు కోపంవస్తే క్షణకాలమే ఉంటుంది. మధ్యములలో ఒకటి, రెండు గంటలు ఉంటుంది. అధములలో ఒక రాత్రీ, పగలూ ఉంటుంది. నీచులకు కోపంవస్తే చచ్చేవరకూ ఉంటుంది.]


సంపుటి 83 డిసెంబర్ '88 సంచిక 6

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00


CHITRA

# చందమామ కబుర్లు



## చిన్నచిన్న కోతులు

తెల్లపులులకు ప్రసిద్ధి గాంచిన భువనేశ్వర్ సమీపంలోని నందన్‌కానన్ జంతుప్రదర్శనశాలకు, ఇటీవల అమెరికా నుంచి రెండు మర్మోసెట్ జాతి కోతులను తెప్పించారు. ఈ కోతులు ఆరు అంగుళాల మేరకు మాత్రమే ఎదగగలవు.

## అతివృద్ధ దంపతులు



సోవియట్ రష్యాకు చెందిన ఇలియస్ జపరోవ్‌కు 122 సంవత్సరాలు. అతని భార్య ఖాలియన్ వయసు 118 సంవత్సరాలు. బాకూ సమీపంలో నివసిస్తున్న ఈ వృద్ధదంపతులు తమ పిల్లలూ, మనమలూ, మునిమనమలూ అంతా కలిసి దాదాపు 200 మంది కుటుంబ సభ్యుల సమక్షంలో గత సెప్టెంబర్‌లో—తమ 103 వ పెళ్ళిరోజు వేడుకలను ఎంతో ఉత్సాహంగా జరుపుకున్నారు.



## ఆపదలో ఐకమత్యం

సెప్టెంబర్‌లో అస్సాంను ముంచెత్తిన వరదల సమయంలో— అడవిఏనుగులూ, విషసర్పాలూ, పెద్దపులీ అన్నీ ఒకేచోట సోనిత్‌పూర్ సహాయకశిబిరం సమీపంలో—తమ జాతి వైరాలు విస్మరించి శాంతియుత సహజీవనం గడిపాయి. సమీపంలో నడయాడుతున్న మనుషులజోలికి కూడా ఆ జంతువులు పోనేలేదు!

## టెల్ అవీవ్‌లో కనిపించిన వస్తువులు ఏమిటి ?



నారింజరంగు కాంతిని వెదజల్లుతూ గుర్తుతెలియని రెండు వస్తువులు ఆకాశంలో ఎగరడం ఇటీవల—టెల్ అవీవ్ నగరవాసులు చూశారు. అవి ఎటువంటి వస్తువులు? ఎందుకలా వచ్చాయి? అన్న విషయాన్ని విజ్ఞానవేత్తలు చెప్పలేక పోయారు!

# మౌనంవిలువ

మంగాపురం జమీందారుకు ఎక్కువగా మాట్లాడే అలవాటు వుండేది. కోపిష్ఠికావడంవల్ల, ఆ విషయం ఆయనకు తెలియజెప్పడానికి ఎవరికీ ధైర్యం లేకపోయింది.

ఒకనాడు జమీందారు ఒంటరిగా వాహ్యాళికి వెళ్ళారు. ఊరిచివర ఒక అందమైన కొండ వున్నది. జమీందారుకు కొండ మీదికి వెళ్ళాలనిపించింది. కొండ దిగువన గొర్రెలకాపరి ఒకడు కనిపించాడు. వాణ్ణి తోడుగా రమ్మని జమీందారు కొండకేసి నడిచాడు.

గొర్రెలకాపరి మాట్లాడకుండా చకచకా కొండెక్క పోసాగాడు. జమీందారు ఏవేవో మాట్లాడుతూ వెనకబడిపోయాడు; కొంతసేపటికి ఆయాసంతో ఒక బండమీద చతికిలబడ్డాడు.

"కొండెక్కాలంటే, మౌనంగా నడవడం చాలా ముఖ్యం. అప్పుడే అలసట లేకుండా త్వరగా కొండెక్కగలం," అన్నాడు గొర్రెలకాపరి అమాయకంగా.

కొండెక్కడానికే కాదు; జీవితంలో పైకి రావాలన్నా అతిగా మాట్లాడటం మంచిది కాదన్న విషయం — జమీందారుకు అప్పుడు అర్థమయింది. ఆ తరవాత ఆయన మౌనంవిలువ తెలుసుకుని అందరిచేతా మితభాషి అనిపించుకున్నారు.

— తాటిచెర్ల గురురామప్రసాద్






కేతవరం చాలా పెద్ద గ్రామం. ఆ గ్రామంలో రాముడనే వాడుండేవాడు. వాడికి తల్లి వున్నది, తండ్రి లేడు. వాడు కష్టపడి పని చేస్తాడుగానీ, చాలా దుడుకు మనిషి. నోటిమంచితనం వుంటే తప్ప, జీవితంలో నెగ్గుకురావడం కష్టమని, తల్లి వాడికి పదేపదే చెబుతూంటుంది.

అయినా వాడు, ఆమె మాటలను చెవిని పెట్టకుండా, ''కష్టపడి పని చేసుకునే వాణ్ణి. ఒకరిచేత మాట పడాల్సిన అవసరం, నాకు లేదు,'' అనేవాడు.

ఒకసారి వాణ్ణి, ఆ ఊరు కరణంగారు పిలిచి, ''మా నాన్న ముసలివాడైపోయాడు. ఒక మనిషి దగ్గిరుండి కనిపెట్టి చూస్తూండాలి. నాకేమో ఊరినిండా పనులు. క్షణం తీరికుండదు. నా పెద్ద కొడుకు వ్యవసాయం. రెండోవాడు చదువు. ఆడపిల్లలిద్దరూ సంగీతం నేర్చుకుంటున్నారు. నా భార్యకేమో ఇంటిపనీ, వంటపనీ! నువ్వు కొంతకాలంపాటు మా నాన్నను కనిపెట్టుకుని వుంటానంటే, నీకు నెలకు అయిదువందలవరహాలిస్తాను," అన్నాడు.

రాముడు రోజంతా ఊళ్ళో కష్టపడి పనిచేసినా, నెల తిరిగేసరికి రెండు వందలవరహాలకు మించి దొరకవు. వాడికొక మంచి ఎడ్ల జత వున్నది. వాటిని నాగలికికట్టి పొలం దున్నడమూ, బండికి కట్టి బరువులు లాగించడమూ, వాడు చేసేపని. అందువల్ల వచ్చే ఆదాయం తక్కువయినా, వాడికదే గౌరవంగా తోస్తుంది తప్ప, ఒకరింట పనిమనిషిగా వుండడం యిష్టం లేదు.

వాడు, కరణంగారితో, ''కన్నతండ్రికి స్వయంగా సేవలు చేసుకునే అదృష్టం వస్తే, సంతోషించడానికి బదులు పనివాణ్ణి పెడతావా? ఇదేనా తండ్రి ఋణం తీర్చు

"వసుంధర"



పోతే, నా వంట్లో ఎంత సత్తువుందో, నీ పిల్లల్లోనూ అంత సత్తువుంది. ఒక్క రోజుకు వాళ్ళు పని చేయలేరా?'' అని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వాణ్ణి, భూస్వామి భూషయ్య పిలిచి నీళ్ళు తోడమన్నాడు. వైద్యుడు వీరన్న మందులు నూరి పెట్టమన్నాడు. పెద్దరైతు పేరయ్య దొడ్డి ఊడిచి పెట్ట మన్నాడు. రాము డెవ్వరికీ పని చేయ లేదు. అందర్నీ తిట్టిపోసి, ఇంటికి వెళ్ళి చిరాగ్గా కూర్చున్నాడు.

అప్పుడు వాడి తల్లి, వాడి దగ్గిర కొచ్చి, ''పొరుగూళ్ళో మీ మామయ్యకు, మన ఎడ్లజతతో పని పడిందట. బండికట్టుకుని వెళ్ళు.'' అన్నది.

రాముడి మామయ్యకు, రాముడన్నా, వాడి ఎడ్లజతన్నా ఎంతో యిష్టం. వాడికి, ఆయన తన కూతుర్నిచ్చి పెళ్ళి చేయా లనుకుంటున్నాడు. మామయ్యంటే రాముడికీ ఎంతో యిష్టం. కాబోయే భార్యను చూడడం కోసం, వాడు వెంటనే బండికట్టి ప్రయాణమయ్యాడు.

వాడు పొరుగూరు పొలిమేరల్లోకి వెళ్ళే సరికి, ఒక బలిష్ఠుడైన మనిషి వాణ్ణి అటకాయించి, ''బండి దిగు!'' అన్నాడు.

రాముడు బండి దిగి, ''నువ్వెవరు?'' అని అడిగాడు.

కునే పద్ధతి? ఇది నీకు నచ్చిందేమో కానీ, నాకు నచ్చలేదు,'' అని వెళ్ళిపోయాడు.

ఆ రోజే వాణ్ణి, మునసబుగారు పిలిచి, ''రేపు మా ఇంట్లో, మా నాయనగారి ఆబ్దీకం. పెద్ద ఎత్తున వంటలు చేయాలి. ఉన్నట్టుండి వంటాయన ఆరోగ్యం పాడ యింది. ఆయన, దగ్గరుండి అన్ని పనులూ చేయిస్తాడట. కానీ బిందెలు వార్చడానికి మనిషి కావాలి. నువ్వు సాయం చేస్తా నంటే, ఒక్క రోజుకు నూరువరహా లిస్తాను,'' అన్నాడు.

రాముడు దీనికీ మండిపడి, ''నేను పొలం దున్నేవాడినే కానీ, వంటవాణ్ణి కాను. డబ్బున్నదన్న అహంకారం కాక

అ మనిషి, రాముణ్ణి ఒక్క తోపుతోసి, "ఈ బండి నాది!" అంటూ, బండ్లో ఎక్కి కూర్చున్నాడు.

రాముడు, వాడి మీద కలబడదామను కున్నంతలో, పొన్నుకర్ర ఆడిస్తూ కొంచెం దూరంలో నిలబడి వున్న మరొకతను, "నేనాకనబడే గ్రామ పెద్దను. తెలియడం లేదా వాడెవడైందీ? ఇక నీ దారినపో," అన్నాడు కసురుతున్నట్టు.

బలిష్ఠుడు బండిలో గ్రామం కేసి వెళ్ళాడు. రాముడు నీరసంగా కాళ్ళీడ్చు కుంటూ మామయ్య ఇంటికి చేరుకుని జరిగింది చెప్పాడు.

"వాడు వస్తాదు మల్లన్న అయుంటాడు. ఈ మధ్య వాడి అగడాలు మితిమీరి పోతున్నాయి," అంటూ నిట్టూర్చాడు రాముడి మామయ్య.

"మామయ్యా, నా బండి, ఎడ్లజత మళ్ళీ, నాకిప్పించు," అన్నాడు రాముడు దీనంగా.

"అది నావల్ల కాదురా! వాడు చాలా ప్రమాదకరమైన మనిషి. ఊళ్ళో మా ఎవరి జోలికీరాడు. మేము వాడి జోలికి వెళ్ళామంటే మాత్రం, మా అంతు చూస్తాడు," అన్నాడు రాముడిమామయ్య.

"ఈ ఊరికి పెద్దలు లేరా? అన్యాయం జరిగితే ఎవరూ అపరా?" అన్నాడు రాముడు కోపంగా.

"ఎందుకు లేరు? ఉన్నారు. కానీ యీ మల్లన్న ఎంత దుడుకువాడైనా, పెద్ద





లందరితోనూ మంచిగా వుంటాడు. వాళ్ళు చెప్పినట్లు విని, వాళ్ళ పనులు చేస్తాడు. అందుకని వాడి ఆటలు సాగుతున్నాయి. వాళ్ళంతా వాడిపక్షమే!'' అన్నాడు రాముడి మామయ్య.

''అయితే నా బండి నాకు తిరిగి వచ్చే మార్గం లేదా?'' అని అడిగాడు రాముడు దిగులుగా.

''ఒక ఉపాయముంది. పెద్దలు, మన బోటి చిన్నవాళ్ళ బాధల గురించి పట్టించుకోరు. కానీ పెద్దల కన్యాయం జరగనివ్వరు. మీ ఊరి పెద్ద లెవరైనా నీ తరఫునవస్తే, నీ పని సానుకూలమవుతుంది,'' అన్నాడు రాముడి మామయ్య.

రాముడు మరింత నీరసపడిపోయి, ఊళ్ళో జరిగినదంతా చెప్పాడు. అప్పుడు రాముడి మామయ్య ముక్కుమీద వేలేసుకుని, ''ఔరా! ఎంత పని చేశావురా! అల్లరిచిల్లరగా తిరిగే మల్లన్నకే, నోటి మంచితనం వల్ల ఊళ్ళో గౌరవముంది. కష్టపడి పని చేసుకునే, నీకెంత గౌరవముండాలి! నీ ఊరి పెద్దలను క్షమార్పణైనా అడుగు—లేదా మా ఊరి మల్లన్న కాళ్ళుపట్టుకో. నీ పని సానుకూలమవుతుంది,'' అన్నాడు.

''కాళ్ళు పట్టుకునేమాటైతే, మా ఊరి పెద్దల కాళ్ళే పట్టుకుంటాను,'' అంటూ రాముడు వెంటనే తన ఊరుకు తిరిగి వెళ్ళి, ముందు కరణంగారింటికి వెళ్ళాడు.

ఆయన, వాడివంక గుర్రుగా చూస్తూ చూసి, "ఏరా? నీకిక్కడేంపని?" అన్నాడు.

రాముడు, కరణంగారి కాళ్ళ మీద పడి, ''అయ్యా! నావల్ల పొరబాటై పోయింది. నీబోటివారింట్లో ఎవర్ని సేవించుకున్నా, నాకు పుణ్యమే వస్తుంది. అటువంటిది పెద్దలు, పరమపూజ్యులు అయిన నీ తండ్రిగారిని సేవించుకునే అదృష్టంవస్తే కాదన్నాను. నీవు నాకు ఒక్కవరహా అయినా యివ్వనవసరం లేదు. నేను నీ తండ్రిని ఈ క్షణం నుంచే సేవించుకుంటాను,'' అన్నాడు.

కరణం చప్పున చల్లబడిపోయి, "అవేం మాటల్రా? ఉదయం నీవన్న మాటలకు నా కళ్ళు తెరుచుకున్నాయి. డబ్బుందన్న అహంకారంతో, నా బాధ్యతలు నేను మరిచిపోయాను. నా తండ్రిని నేను సేవించుకోవాలిగానీ, వేరే మనిషిని పెట్టడం ఎంత తప్పు!" అన్నాడు.

రాముడు అదే విధంగా మునసబు, భూషయ్య, వీరన్న, పేరయ్య—అందరికీ క్షమార్పణ చెప్పుకున్నాడు. వాళ్ళందరూ కూడా కోపాన్ని మరిచిపోవడమే గాక, తప్పు తమదే అని ఒప్పుకున్నారు.

ఒక వారం రోజులపాటు రాముడు ఊళ్ళో అందరితోనూ ఎంతో మంచిగా వున్నాడు. రాముడిలో మార్పు వచ్చి నందుకు, అందరూ సంతోషించడమేగాక, యీ మంచి గుణంవల్ల బంగారానికి తావి అబ్బినట్లయిందని వాణ్ణి మెచ్చుకున్నారు.

తర్వాత రాముడు పొరుగూరు వెళ్ళి, తిన్నగా వస్తాదు మల్లన్న ఇల్లు చేరుకుని, "ఒరేయ్, మల్లన్నా! నా బండి సిద్ధం చేయి. తీసుకు వెళ్ళడానికి వచ్చాను," అని పెద్ద కేకపెట్టాడు.

మల్లన్న లోపలి నుంచి వచ్చి, రాముణ్ణి చూసి గుర్తుపట్టి, "ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నీ బండి నీది కావాలంటే, నాతో కుస్తీపట్టి ఓడించు," అన్నాడు వెటకారంగా.

"నిన్నోడించడానికి కుస్తీ కూడా పట్టాలా?" అంటూ రాముడు గుప్పెళ్ళు



బిగించి, మల్లన్న గుండెల మీదా, మెడ మీదా బలంగా నాలుగుపోట్లు పొడిచేసరికి, వాడు కుప్పలా కూలిపోయాడు.

రాముడు, మల్లన్న మెడ ఒడిసి పట్టుకుని, "ఒరే, కష్టపడి పని చేసే నావంటి వాడి కండబలంముందు, నీలాంటి సోమరి పెంచిన కండలెప్పుడూ తీసికట్టే!" అని, అక్కడే వున్న తన బండి ఎక్కి, ముందుగా మామయ్య ఇంటికి వెళ్ళి జరిగింది చెప్పాడు.

"ఊరి పెద్దల్ని తీసుకురమ్మంటే, నువ్వే వచ్చావేమిట్రా?" అంటూ వాపోయాడు రాముడి మామయ్య.

"మల్లన్నను దెబ్బ తీయడానికి, నేనొక్కణ్ణే చాలు. మా ఊరి పెద్దలెందుకు?" అన్నాడు రాముడు.

"దెబ్బ తీయగలిగినవాడివి, వెంటనే ఆ పని ఎందుకు చేయలేదు?" అని అడిగాడు రాముడి మామయ్య.

"మల్లన్నకు మీ ఊరి పెద్దల అండ వున్నది. వాడి మీద నా స్వశక్తి ఉపయోగించేముందు, నేనూ నా ఊరి పెద్దల అండ సంపాయించుకోవాలికదా! ఆ పని పూర్తిచేసుకుని వచ్చాను. ఇప్పుడు మీ ఊరి పెద్దలు, మా ఊరు వచ్చి ఫిర్యాదు చేసినా నాకే న్యాయం చేకూరుతుంది," అన్నాడు రాముడు గర్వంగా.

"మనలో నోటిమంచితనం వుంటే, ఎవరైనా మన తప్పుల్ని సానుభూతితో అర్థం చేసుకుంటారు. న్యాయంగా మసిలే వాళ్ళకు కూడా న్యాయం జరగాలంటే, నోటి మంచితనం కావాలి. ఈ సత్యాన్ని గ్రహించావు కాబట్టి, నువ్వు ప్రాజ్ఞుడివైనట్లే! త్వరలోనే ముహూర్తం పెట్టించి, నీకు కబురు చేస్తాను. నాకిప్పుడెంతో సంతోషంగా వున్నది," అన్నాడు రాముడి మామయ్య.

రాముడు ఇల్లు చేరుకుని, జరిగినదంతా తల్లికి చెప్పాడు. ఆమె ఎంతో సంతోషించింది. ఆ తర్వాత వాడు పెళ్ళి చేసుకుని, నోటిమంచితనంతో కలకాలం సుఖంగా జీవించాడు.





# వైద్యుడి బాధ్యత

పర్వత రాజ్యంలో వుండే ఉత్తముడు, గొప్ప వైద్యుడుగా పేరు పొందాడు. ఆ రాజ్యానికి పొరుగుననే వున్న పుష్పరాజ్యం, పర్వత రాజ్యానికి బద్ధశత్రువు. దాని రాజు వ్యాఘ్రసేనుడు, పర్వత రాజ్యాన్ని ఆక్రమించాలని రెండుసార్లు ప్రయత్నించి, రాజు శివప్రభువుచేతిలో ఓడి పారిపోయాడు.

ఆ రెండు రాజ్యాల సరిహద్దులలో వుండే పుష్పరాజ్య ప్రజలు, అనారోగ్యానికి గురిఅయినప్పుడు, ఉత్తముడి దగ్గిరకు వచ్చి చికిత్స పొందుతూండేవాళ్ళు.

ఒకనాడు శివప్రభువు, ఉత్తముడికి, "మీరు శత్రుదేశ ప్రజలకు వైద్యం చేయడం మానకపోతే, మిమ్మల్ని శిక్షించవలసి వుంటుంది," అని కబురు పంపాడు.

అయినా, ఉత్తముడు పుష్పరాజ్యం నుంచి వచ్చే రోగులకు వైద్యం చేయడం మానలేదు. రాచకార్యాల్లో మునిగిన శివప్రభువు, యీ విషయాన్ని తాత్కాలికంగా మరిచిపోయాడు.

ఒక నెల గడిచాక, రాజు రథంమీద అరణ్యానికి వేటకుపోయి తిరిగివస్తున్నాడు. ఒకచోట ఆయనకు, యిద్దరు శిష్యులతో మూలికలు సేకరిస్తున్న ఉత్తముడు కనిపించాడు.

రాజుకు వెంటనే తాను, ఉత్తముడికి పంపిన కబురు గుర్తుకువచ్చింది. ఆయన వెనుకవస్తున్న అశ్వసైనికులను ప్రశ్నించి, ఉత్తముడు పొరుగురాజ్యం వారికి వైద్యం చేయడం మానలేదని తెలుసుకున్నాడు.

అంతలో ఉత్తముడూ, ఆయన శిష్యులూ రాజు దగ్గిరకు వచ్చి నమస్కరించారు. శివప్రభువు ఆగ్రహంతో, "మీరు గొప్ప వైద్యులని తెలుసు. కాని, మా ఆజ్ఞ ధిక్కరించి శత్రువులకు సహాయం చేస్తున్నారు. అది దేశద్రోహం. మీకు తగిన శిక్ష

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

విధిస్తాను," అని సైనికులకు ఉత్తముడిని బంధించి తీసుకురావలసిందిగా అజ్ఞ యిచ్చి బయలుదేరాడు.

కొంతదూరం వెళ్ళేసరికి, రథచక్రం శీల జారిపోయి చక్రం వేరై దొర్లుకుంటూ పోయి పొదల్లోపడింది. రథం నేలకూలే సమయంలో సారథి వడుపుగా కిందికి దూకేశాడు. రాజు మాత్రం రథంతోపాటు కిందపడడంతో మోకాళ్ళమీదా, భుజం మీదా గాయాలు తగిలినై.

అది చూసిన ఉత్తముడు, సైనికులతో, "రాజుగారిని గుర్రంమీదఎక్కించి నా కుటీరానికి తీసుకురండి!" అని చెప్పాడు.

రాజు కుటీరానికి రాగానే, ఉత్తముడు ఆయన గాయాలు కడిగి, మందువేసి కట్లుకట్టి కుటీరంలోకి వెళ్ళాడు.

గురువు అలా వెళ్ళగానే, ఆయన శిష్యులలో ఒకడైన ప్రవీణుడు అనేవాడు రాజుతో, "మహారాజా, దేశద్రోహ నేరం కింద మా గురువుగారిని శిక్షించేందుకు తీసుకుపోతున్నారు. అంటే, ఆ సమయంలో మా గురువుగారికి మీరు శత్రువులే కదా?" అన్నాడు.

రాజు శివప్రభువు విని మౌనంగా వూరుకున్నాడు. అప్పుడు ప్రవీణుడు, "ఆ పరిస్థితిలో, మా గురువుగారు, తమకు వైద్యం చేయకపోతే, తమరు ఏమయ్యేవారు? వైద్యుడి బాధ్యత రోగులకు చికిత్స చేసి, వాళ్ళ బాధలు నివారించడం. అంతేగాని, ఆపదలో వున్నవాడు మిత్రుడో, శత్రువో తెలుసుకుని చికిత్స చేయాలని, ఏ వైద్యశాస్త్రంలోనూ లేదు," అన్నాడు.

రాజు, ఉత్తముడి శిష్యుడు చెప్పిన దానిలోని సత్యాన్ని గ్రహించాడు. ఆయన కుటీరంలో నుంచి బయటికి వచ్చిన ఉత్తముడితో, "వైద్యశ్రేష్ఠా! ఎప్పటి లాగే మీరు శత్రువు, మిత్రుడు అన్న భేదభావం లేకుండా వైద్యవృత్తి కొనసాగించండి. ఇందులో, మీకేదైనా సహాయం కావలసి వస్తే కబురుపంపండి," అని, మెడలోని రత్నాల హారం తీసి ఉత్తముడికి బహూకరించి, తన పరివారంతో వెళ్ళిపోయాడు.





సుసంపన్నమైన కౌశాంబీ రాజ్యాన్ని సూర్యసేనుడనే రాజు పరిపాలించేవాడు. ఆయనకు లేకలేక ఒక కూతురు పుట్టింది. రాజు పరమానందం చెందాడు. ఆమెకు సులోచన అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచసాగాడు. అయినా, తనకు మగ సంతానం లేకపోవడంవల్ల, తన తదనంతరం తన కుమార్తె యోగక్షేమాలు ఎవరు చూసుకుంటారో అన్న దిగులు రాజుకు పట్టుకున్నది. ఆ బెంగతోటే ఆయన కొన్నాళ్ళకు మరణించాడు.

అపురూప సౌందర్యవతి అయిన సులోచనను పెళ్ళాడడానికి రాజకుమారులెందరో వచ్చారు. అయినా, ఒక్కరూ ఆమెకు నచ్చలేదు. వారందరూ ఆమె అందచందాలకూ, అపార సంపదకూ ఆశపడి వచ్చినవారే. అటువంటి వారిని వివాహమాడినట్టయితే, రాజ్యంలోని ప్రజలక్షేమం బుగ్గిపాలవుతుందని ఆమె భావించింది. రాజ్యపాలనకు కావలసిన వివేకమూ, ధైర్యసాహసాలూ, పరోపకారబుద్ధీ, కార్యదీక్ష గల రాజకుమారుణ్ణి మాత్రమే పెళ్ళాడాలని ఆమె నిశ్చయించుకున్నది.

సరిగ్గా ఆ సమయానికే, సులోచనకు విద్యాబుద్ధులు నేర్పిన ఆస్థాన పండితుడు సుధాకరాచార్యుడు తీర్థయాత్రలు చేసి తిరిగివచ్చాడు. సులోచన గురువుగారిని పిలిపించి, తన నిర్ణయం తెలియజేసి, తాను వివాహమాడదలుచుకున్న ధీశాలిని ఎలా తెలుసుకోవడమో చెప్పమని ప్రార్థిం



దేశదేశాలనుంచి రాజకుమారులెందరో ఆమెను వివాహమాడడానికి వచ్చారు. అయినా, ఏ ఒక్కరు కూడా ఆమె అడిగిన మొదటి ప్రశ్నకు సైతం సమాధానం చెప్పలేక తిరిగిపోసాగారు.

ఒకనాడు నేపాళ రాజకుమారుడైన ధీరసింహుడు, సులోచనను చూడవచ్చి, ఆమె మొదటి ప్రశ్న ఏమిటో చెప్పమన్నాడు.

"కొన్ని సంవత్సరాలుగా ఈ రాజ్యంలో 'ఒకసారి చూశాను; మళ్ళీ ఒకసారి చూడాలని ఉన్నది' అన్న మాటలు వినిపిస్తున్నవి. ఆ మాటలు ఎక్కడనుంచి వస్తున్నవి? వాటి అంతరార్థం ఏమిటి? ఇదే నా మొదటి ప్రశ్న," అన్నది సులోచన.

"ఒకవారం గడువిచ్చినట్టయితే, మీ ప్రశ్నకు సమాధానం చెప్పగలను," అన్నాడు ధీరసింహుడు.

సులోచన సరేనన్నది.

జీవితంలో ధైర్యసాహసాలే ప్రధానంగా గల ధీరసింహుడు, ఉత్సాహంగా గుర్రమెక్కి తూర్పుదిక్కుగా బయలుదేరి, కొంతసేపటికి ఒక అరణ్య ప్రాంతం చేరుకున్నాడు. అక్కడ రెండు నక్కలు ఏడవడం అతనికి వినిపించింది. ధీరసింహుడికి పశుపక్ష్యాదుల భాష తెలుసు. అతడు గుర్రం దిగి, చెట్టుకింద ఉన్న

చింది. గురువు ఆమె నిర్ణయానికి సంతోషించి, "నీ నిర్ణయం శ్లాఘనీయమైనది. నువు పెళ్ళాడదలచిన ధీరోదాత్తుణ్ణి కనుగొనడానికి ఒక ఉపాయం ఉన్నది. నేను రెండేళ్ళుగా దేశదేశాలన్నీ తిరిగి, విచిత్రాలెన్నిటినో చూసి వచ్చాను. వాటి ఆధారంగా ఐదు ప్రశ్నలిస్తాను. ఆ ఐదు ప్రశ్నలకూ సరైన సమాధానం తెలుసుకుని వచ్చిన రాజకుమారుణ్ణే వివాహమాడగలనని చాటింపు వేయించు. నీ కోరిక నెరవేరుతుంది," అని ఆమెకు ఆ ఐదు ప్రశ్నలూ తెలియజెప్పాడు.

గురువుగారి ఆదేశం ప్రకారం సులోచన చాటింపు వేయించింది. ఆ వార్త విని

నక్కలను సమీపించి, "ఎందుకలా విలపిస్తున్నారు?" అని అడిగాడు.

"ఇక్కడికి కొంత దూరంలోని ఒక గుహలో భయంకరమైన ఖడ్గమృగం నివసిస్తున్నది. అది, మాకు పుట్టే పిల్లలను కాళ్ళతో తొక్కి చంపేస్తున్నది. ఆ కారణంగా మాకు సంతానం లేకుండా పోతున్నది. అదే మా విషాదానికి కారణం," అన్నవి నక్క దంపతులు.

ధీరసింహుడు తక్షణమే బయలుదేరి, మగనక్క దారి చూపగా ఆ గుహ ముఖద్వారం చేరుకున్నాడు. ఖడ్గమృగం గాఢ నిద్రలో ఉన్నది. నిద్రిస్తూన్న ప్రాణిని చంపడం వీరుడికి తగదని భావించి, ధీరసింహుడు ద్వారం పక్కనే ఉన్న చెట్టెక్కి కూర్చున్నాడు. కొంతసేపటికి, ఖడ్గమృగం నిద్రలేచి బయటకు వచ్చింది. ధీరసింహుడు హఠాత్తుగా దాని మీదికి దూకి, గొడ్డలితో దాని తలను బద్దలు చేశాడు. ఖడ్గమృగం గిలగిలా తన్నుకుచచ్చింది.

ధీరసింహుడి సాహసానికి పరమానందం చెందిన నక్క దంపతులు, "రాజకుమారా, నువు చేసిన ఉపకారం జీవితాంతం మరవరానిది. ఈ అరణ్యప్రాంతానికి నువు ఎందుకు వచ్చావు? చెప్పావంటే చేతనైనసాయం చేయగలం," అన్నవి ఎంతో కృతజ్ఞతతో.



ధీరసింహుడు తను వచ్చిన పని గురించి చెప్పాడు.

"ఆ మాటల గురించి మేము కూడా విన్నాము. కాని, అవి ఎక్కడ నుంచి వస్తాయో సరిగా తెలియదు. అయినా, నీవంటి వీరుడికి అసాధ్యమేదీ ఉండదు. ఈ అడవి దాటాక ఎడమవైపు తిరిగి వెళ్ళు; విజయం సాధించగలవు," అని, అతణ్ణి సాగనంపాయి నక్కదంపతులు.

ధీరసింహుడు అడవిదాటి, కాలినడకనే చెట్టుచేమలతో దట్టంగా ఉన్న సమతల ప్రదేశాన్ని చేరుకుని, సేదతీరడానికి ఒక చెట్టుకింద కూర్చున్నాడు. అక్కడ అతనికి రెండు పాములు కనిపించాయి.



పెద్ద పాము, చిన్న పామును చంపబోతున్నది. చిన్నపామును రక్షించే ఉద్దేశంతో, ధీరసింహుడు పెద్దపాము మీదికి కత్తి దూశాడు. ఇంతలో పాములు మాయమై, వాటిస్థానంలో ఇరువురు గంధర్వులు ప్రత్యక్షమయ్యారు.

"మీరు ఎవరు? ఎందుకిలా ఒకరినొకరు హింసించుకుంటున్నారు?" అని అడిగాడు ధీరసింహుడు.

"నేను చిన్నప్పుడు తెలియక అతనికొక అపకారం చేశాను. అప్పటి నుంచి నా మీద పగబట్టి సమయం దొరికినప్పుడల్లా ఇలా హింసిస్తున్నాడు," అన్నాడు చిన్నగంధర్వుడు.

"తెలియక అపరాధం చేసిన వారిని క్షమించడమే గొప్పవారి లక్షణం. పాత పగలన్నిటినీ మరచిపోయి, ఇకపై మీరు ఒకరిపట్ల ఒకరు ప్రేమతో మసలుకొండి. అదే ఉభయులకూ క్షేమదాయకం," అంటూ ధీరసింహుడు వారికి ఎన్నో నీతులు తెలియజెప్పాడు.

ఆ మాటలకు గంధర్వు లిరువురూ సంతోషించి, "చిరకాలంగా మా మధ్య ఉన్న పగను పోగొట్టి, మైత్రిని ఏర్పరచిన నీ మేలు మరవరానిది. మేము నీకు చేయగల సహాయం ఏదైనా వుంటే చెప్పు, నీ రుణం తీర్చుకుంటాము," అన్నారు.

ధీరసింహుడు తను వచ్చిన పని గురించి చెప్పాడు.

"ఆ మాటలను మేమూ విన్నాము. ఇక్కడి నుంచి కొంతదూరం వెళ్ళి, కుడివైపుకు తిరిగావంటే ఒక తటాకం కనిపిస్తుంది. అక్కడికి చేరుకున్నతరవాత ఏమి చెయ్యాలో నీకే తెలియవస్తుంది. నీకు తప్పక జయం కలుగుతుంది," అని దీవించి గంధర్వులు అదృశ్యమయ్యారు.

ధీరసింహుడు వారు చూపిన దారి కుండా వెళ్ళి తటాకం చేరుకున్నాడు. అతడు విశ్రాంతి తీసుకోవడానికి తటాకం ఒడ్డున ఉన్న ఒక బండ మీద కూర్చునేసరికి, తటాకం నుంచి ఒక మత్స్యకన్య

పైకి వచ్చి ధీరసింహుడి చేయి పట్టుకుని లోపలికి తీసుకుపోయింది.

తటాకం లోపల రమణీయమైన ఉద్యానవనం ఉన్నది. దూరంగా సెలయేళ్ళు గలగలా ప్రవహిస్తున్నవి. కనుల పండుగచేసే రకరకాల చెట్లూ, లతలూ ఫలపుష్పాలతో కళకళలాడుతున్నవి. నేలంతా పచ్చలతో తాపడం చేసినట్టున్నది. ఉద్యానవనం మధ్య బ్రహ్మాండమైన భవనం కనిపించింది. మత్స్యకన్య, ధీరసింహుణ్ణి ఆ భవనంలోని విశాలమైన మంటపం లోపలికి తీసుకుపోయి నవరత్న ఖచిత సింహాసనంలో కూర్చోబెట్టింది. మంటపం నాలుగువైపులా నాలుగు అందమైన స్త్రీల చిత్రపటాలు వరుసగా ఉన్నవి. ఒకచోటమాత్రం ఖాళీస్థలం కనిపించింది. ఇంతలో ధీరసింహుణ్ణి లోపలికి తీసుకు వచ్చిన మత్స్యకన్య కూడా పటంగా మారిపోయి, ఆ ఖాళీస్థలాన్ని పూర్తిచేసింది.

ధీరసింహుడు, నిర్మానుష్యంగా వున్న ఆ భవనాన్ని వదిలి వెలుపలికి వచ్చాడు. ఆకలి వేయడంతో అక్కడి ఫలాలను కోసి తిన్నాడు. కాని, ఆకలి తీరలేదు. సెలయేళ్ళలోని నీళ్ళు ఎన్ని తాగినా దాహం తీరలేదు.

సూర్యాస్తమయమై చీకటి పడడంతో, ధీరసింహుడు మళ్ళీ భవనంలోకి ప్రవేశించాడు. అతడు మంటపంలో అడుగు పెట్టగానే దీపాలు వాటంతట అవే వెలిగాయి. గోడలకు వేలాడుతున్న ఐదు





పటాలూ ఐదుగురు కన్యలుగా మారి ధీర సింహుడి చుట్టూ చేరి, పాడుతూ నృత్యం చేయసాగారు. రాత్రంతా, వారి ఆట పాటలతో గడిచింది. తెల్లవారేసరికి ఆ కన్యలందరూ మళ్ళీ చిత్రపటాలుగా మారి గోడలకు వేలాడసాగారు.

ధీరసింహుడు అమితాశ్చర్యంతో ఆ మంటపాన్ని పరిశీలనగా చూడసాగాడు. అప్పుడతనికి ఒక కన్నంలోనుంచి, చీమల బారు పాకుతూ బయటకు రావడం కనిపించింది. అతడు గోడను తడితే బోలుగా ధ్వనించింది. వెంటనే అతడు గోడను బద్దలుకొట్టాడు. అందులో ఒక అరా, అరలో ఒక పాత తాళంచెవి కనిపించింది. ఆ తాళంచెవి సహాయంతో, అతడు భవనంలో మూసి ఉన్న ఒక్కొక్క గదినీ తెరవబోయాడు. కాని ఒక్క గది తాళం కూడా రాలేదు. ఆఖరికి అతడు చివరనున్న ఒక గది తాళాన్ని తీయగలిగాడు. ఆ గదిలో చిన్న ఇనుపపెట్టె కనిపించింది. కాని, అది తాళం వేయబడి ఉన్నది. తాళంచెవికోసం గదంతా గాలించాడు. కాని, ప్రయోజనం లేకపోయింది. అతడు గదిలో అటూ ఇటూ తిరుగుతూండగా, అతని కాలు ఒక మీట మీదపడి ఇనుపపెట్టె గభీమని తెరుచుకున్నది. ఆ పెట్టెలో ఒక రాగి రేకు కనిపించింది.

ధీరసింహుడు రాగిరేకును తీసి చదివాడు: ''ఇదంతా మాయ! ఈ తోట మధ్యలో ఉన్న బంగారు వృక్షాన్ని పెకలించిన ధీరుడు ఈ మాయను తెలుసుకోగలడు.'' అని అందులో రాసి ఉన్నది.

ధీరసింహుడు ఉత్సాహంగా తోటలోకి వెళ్ళాడు. రాగిరేకుమీద రాసి ఉన్న విధంగానే ఉద్యానవనంమధ్యలో బంగారు వృక్షం కనిపించింది. అయినా, అతడు ఎంత ప్రయత్నించినప్పటికీ దానిని కదిలించలేకపోయాడు. కొంతసేపటికి అతని దృష్టి, ఆ వృక్షం పక్కనే ఉన్న మరొక బంగారు మొక్క మీద పడింది.

అతడు దానిని పెరికి అవతల విసిరాడు. మరుక్షణమే ఆ పెద్ద వృక్షం కూడా పెళ పెళా రావంతో నేల కూలిపోయింది. ఆ పెద్ద ధ్వనికి తట్టుకోలేక ధీరసింహుడు స్పృహ తప్పి పడిపోయాడు. కొంతసేపటికి తేరుకుని కళ్ళు తెరిచాడు. అక్కడ సుందర ఉద్యానవనమూ లేదు; భవనమూ లేదు. కాని రాత్రి అతనిచుట్టూ నాట్యం చేసిన కన్యలు మాత్రం బిలబిలమంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు.

''ఎవరు మీరు? ఈ మాయ అంతా ఏమిటి?'' అని వారిని అడిగాడు ధీరసింహుడు.

''మేము, ఇక్కడికి పదియోజనాల దూరంలో ఉన్న మాయావతి పట్టణ రాజకుమార్తెలము. మాకు యుక్త వయస్సు రాగానే పెళ్ళి చేయమని మా తండ్రిని కోరాము. మా తొందరపాటుకు ఆగ్రహించి, మా తండ్రి మమ్ములనీ మాయాభవనంలో బంధించాడు. మా అపరాధాన్ని క్షమించమని వేడుకున్నాము. అప్పుడాయన, 'మీకు ఈ మాయాభవనంలో నుంచి, విముక్తి కలిగించినవాడే మీకు తగిన వరుడు,' అని చెప్పాడు. ఇంతకాలానికి ఈ మాయను ఛేదించగల మహానుభావుడివి కనిపించావు. కనక నువు మమ్మల్ని వివాహ మాడవలసింది,'' అన్నారు ఆ కన్యలు.

''నేను మరొక ముఖ్యమైన సమస్యను పరిష్కరించడానికి వెళుతున్నాను. వివాహం సంగతి ఆలోచించడానికి సైతం



ఇప్పుడు వ్యవధిలేదు. మీ కోరిక నిరాకరిస్తున్నందుకు నన్ను క్షమించండి,'' అంటూ ధీరసింహుడు ముందుకు నడిచాడు.

ఇలా కొంతదూరం వెళ్ళేసరికి, అతనికి, ''ఒకసారి చూశాను. మళ్ళీ ఒకసారి చూడాలని ఉన్నది,'' అన్న మాటలు వినిపించాయి. ఆ మాటలు వినిపించిన దిక్కుకేసి నడిచాడు ధీరసింహుడు. ఒక చెట్టుకింద రాజకుమారు డొకడు చిక్కి శల్యమై కనిపించాడు.

ధీరసింహుడు అతన్ని సమీపించి, ''ఎవరు నువ్వు? ఎందుకిలా దీనంగా ఉన్నావు?'' అని అడిగాడు.

''ఇక్కడికి సమీపంలో ఉన్న మాయామందిరంలో ప్రవేశించిన రాజకుమారులలో నేనొకణ్ణి. అక్కడ ఉన్న రాకుమార్తెలలో ఒకామెను చూసి, ఆమె అందానికి ముగ్ధుడినై, ఆమెనే పెళ్ళాడాలనుకున్నాను. అయినా, ఆ భవనం నుంచి బయటకు వచ్చాక, మళ్ళీ అక్కడికి వెళ్ళడానికి దారీతెన్నూ తెలియడం లేదు. నేను పెళ్ళాడదలచిన ఆమెను, ఒకసారి చూశాను; మళ్ళీ ఒకసారి చూడాలని ఉన్నది. అయినా, నా కోరిక తీరని కోరికగానే మిగిలిపోయింది,'' అన్నాడా రాకుమారుడు.

ధీరసింహుడు, ఆ రాజకుమారుణ్ణి వెంటబెట్టుకుని మళ్ళీ మాయాభవనంలో ప్రవేశించి, ఆ రాకుమారుడు ప్రేమించిన రాకుమార్తెతో అతనికి వివాహం జరిపించాడు.

ఆ తరవాత, ధీరసింహుడు కౌశాంబీ నగరం చేరుకుని, సులోచనను దర్శించి, తాను చూసి వచ్చిన విశేషాలనూ, ఆమె చెప్పిన మాటలు ఎక్కడ నుంచి వినిపించిన సంగతీ వివరంగా తెలియజేశాడు.

అంతా విన్న సులోచన, ''అవును. నా మొదటి ప్రశ్నకు ఇదే సరైన సమాధానం. ఇప్పుడు ఆ మాటలు వినిపించడం కూడా లేదు. రెండవ ప్రశ్న రేపు చెబుతాను," అని ధీరసింహుణ్ణి సాగనంపింది.--(ఇంకావుంది)






# ప్రతిజ్ఞాభంగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎవడో అసమర్థుడూ, జిత్తులమారీ అయిన వాడి కుతంత్రాల్లో చిక్కి, భూతప్రేతాలు మాత్రమే సంచరించే ఈ శ్మశానంలో అర్ధరాత్రివేళ తిరుగుతున్నావని నాకు జాలికలుగుతున్నది. బహుశా, ఆ అసమర్థుడికి కార్యం సాధించిపెట్టగలనని, నువ్వు ప్రతిజ్ఞచేసి వుండవచ్చు. కాని, కొన్ని సందర్భాలలో ఎంతటి నీతివంతులూ కూడా స్వార్థానికి దాసులై, ప్రతిజ్ఞాభంగం చేస్తారు. ఇందుకు ఉదాహరణగా నీకు వజ్రదేహుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



సింధూరదేశాన్ని, సింగభూపాలుడనే రాజు పాలిస్తూండేవాడు. ఆయనకు ఒకే ఒక కుమార్తె. ఆమె పేరు సుచిత్ర. గొప్ప సౌందర్యవతి. రాజు ఆమెకు వివాహ ప్రయత్నాలు చేస్తున్నాడని తెలిసి, ఎందరో రాజకుమారులు, ఆమెను వివాహమాడ గోరుతూ, దూతలద్వారా రాజుకు లేఖలు పంపారు.

అయితే, సుచిత్ర అందుకు యిష్టపడక, గొప్ప పరాక్రమవంతుడూ, వీరుడూ అని నిరూపించుకోగలవాణ్ణే, తాను వివాహమాడగలనని పంతం పట్టింది.

మంత్రి భానువర్మకు, చంద్రవర్మ అనే కొడుకున్నాడు. తండ్రి జిత్తులమారీ, స్వార్థపరుడూ అయితే; కొడుకు అసమర్థుడే కాక పరమపిరికివాడు. అతడికి ఎలాగైనా రాకుమారిని వివాహమాడాలన్న కోరిక కలిగి, ఆ సంగతి తండ్రితో చెప్పాడు.

అది విన్న భానువర్మ విసుక్కుంటూ, "కోరికైతే బాగుంది! కాని, కత్తిపట్టడమే చేతకాని నిన్ను, పరాక్రమవంతుణ్ణి చేయడం ఎలా?" అన్నాడు.

అందుకు చంద్రవర్మ విచారంగా, "నాన్నా, తంత్రకుతంత్రాల్లో మీరు, కౌటిల్యులంతటివారన్న ఖ్యాతి వున్నది గదా. ఏదో తంత్రం ద్వారా నేను మహాపరాక్రమశాలినని నలుగురినోటా పలికించలేరా?" అని అడిగాడు.

మంత్రి భానువర్మ కొద్దిసేపు ఆలోచించి, "అయితే, ఒక చిన్న సాహసం చెయ్యి. తూర్పు సరిహద్దు గ్రామాల్లో పులి ఒకటి, మనుషులను చంపి తింటున్నది. నువ్వు వెళ్ళి, ఆ పులిని చంపడానికి ప్రయత్నించు. పులిని చంపావో, యువరాణి నీకు దక్కినట్టే!" అని చెప్పాడు.

చంద్రవర్మ, పులి వుండే అడవి ప్రాంతానికైతే వెళ్ళాడు గాని, లోపలికి ప్రవేశించేందుకు సాహసించలేకపోయాడు. ఆ సమయంలో, అడవిలో నుంచి నిలువెత్తు దృఢకాయుడొకడు చచ్చిన పులిని భుజాన వేసుకుని వచ్చాడు.



అతణ్ణి చూసి చంద్రవర్మ నివ్వెర పోయి, "అయ్యా, ఈ ప్రాంతాల ప్రజల్ని చంపుతున్న పులి యిదేనా? చేత ఏ ఆయుధం లేకుండా పులిని ఎలా చంప గలిగావు?" అని అడిగాడు.

దానికా దృఢకాయుడు నవ్వి, "నా పేరు వజ్రదేహుడు. నేను ధవళగిరి సైన్యంలో దళాధిపతిగా వుండేవాణ్ణి. అసమర్థులూ, పిరికివాళ్ళూ అంటే నాకు పరమ అసహ్యం. నిన్న జరిగిన ఒక సంఘటనతో, మా సేనానాయకుడు అసమర్థుడని తెలిసిపోయింది. అసమర్థుల కింద పని చేయననీ, పిరికివాళ్ళపై కత్తి దూయననీ ప్రతిజ్ఞచేసి, ధవళగిరి వదిలి బయలుదేరాను. అడవిలో, యీ పులి నన్ను అటకాయించింది. ఒక్క ముష్టి ఘాతంతో చంపి, భుజాన వేసుకున్నాను," అన్నాడు.

వెంటనే చంద్రవర్మ, వజ్రదేహుడి కాళ్ళమీదపడి, "అయ్యా, నేను కత్తిపట్ట చేతకాని అసమర్థుణ్ణి. నా మీద దయ తలిచి, యీ పులి కళేబరాన్ని యిచ్చావంటే, రాజుకు చూపించి ఏదైనా బహుమానం పుచ్చుకుంటాను," అని ప్రాధేయ పడ్డాడు.

వజ్రదేహుడు, చంద్రవర్మ కేసి అసహ్యించుకుంటున్నట్టు చూసి, పులి కళేబరాన్ని కిందపడవేసి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

చంద్రవర్మ, ఆ కళేబరంతో రాజు వద్దకు పోయి, పులిని తానే చంపినట్టు చెప్పి, "ప్రభూ, నన్ను మించిన పరాక్రమ వంతుడు వుంటాడంటారా?" అన్నాడు.

రాజు, తనవేలికి వున్న వజ్రపుటుంగ రాన్ని తీసి, చంద్రవర్మకు బహుమతిగా యిస్తూ, "పులిని చంపినందుకే పరాక్రమ వంతుడివైతే, రాజ్యాలను గెలిచిన వాళ్ళనూ, రాక్షసులను చంపినవాళ్ళనూ ఏమనాలి?" అన్నాడు నవ్వుతూ.

చంద్రవర్మ, రాజు మాటలకు తెల్ల బోయి, తండ్రిని కలుసుకుని జరిగింది



చెప్పాడు. అంతా విన్న మంత్రి, "నువ్వు వెంటనే వజ్రదేహుడు ఎక్కడున్నాడో తెలుసుకుని, వాడి మీద వేగులను నియమించు. లేకుంటే యువరాణి నీకు దక్కదు," అన్నాడు.

చంద్రవర్మ, వజ్రదేహుడి ఆచూకీ తెలుసుకుని, అతణ్ణి కనిపెట్టి వుండేందుకు యిద్దరు వేగులను నియమించాడు.

ఒకనాడు వజ్రదేహుడు, ఒక కొండ ప్రాంతాన పోతూండగా, దాపులనున్న గుహలో నుంచి, "నా గుహముందు నుంచే వెడుస్తున్నావా! ఏమా ధైర్యం? అక్కడే ఆగు!" అన్న భీకరమైన కేక వినిపించింది.

వజ్రదేహుడు గుహ కేసి చూశాడు. అందులో నుంచి, గజబలుడనే రాక్షసుడు గండ్రగొడ్డలితో బయిటికి వచ్చి, వజ్రదేహుడి మీదికి గొడ్డలి ఎత్తాడు. అయితే, వజ్రదేహుడు వాడికి అందకుండా ముప్పు తిప్పలు పెట్టి, చివరకు వాడి చేతవున్న గండ్రగొడ్డలిని దొరకబుచ్చుకుని, వాడి కాళ్ళూ, చేతులూ ఖండించి, అక్కడి నుంచి బయలుదేరాడు.

దూరం నుంచి ఇదంతా చూసిన వేగులు, సంగతి మంత్రి భానువర్మకూ, చంద్రవర్మకూ చెప్పారు. వెంటనే భానువర్మ, కొడుకు బట్టలు చింపి, శరీరానికి అక్కడక్కడా చిన్న గాయాలు చేసి, రాజువద్దకు పంపాడు.

చంద్రవర్మ రాజును దర్శించి, "ప్రభూ, ఈ రాజ్యానికంతటికీ పరాక్రమవంతుణ్ణని నిరూపించేందుకు, గజబలుణ్ణి ఎదుర్కొని హోరాహోరి పోరాడి, వాడి కాళ్ళూ, చేతులూ నరికి తమ దగ్గిరకు వచ్చాను," అని చెప్పాడు.

రాజు ఆశ్చర్యపోయి, "నీ మాటలు ఎలా నమ్మమంటావు? నువ్వొకసారి, మాతో వేటకు వచ్చి, ఎలుగుబంటిని చూసి చెట్టెక్కి దాక్కున్నావు. సరే, నిజానిజాలు తెలుసుకుంటాను. రెండు రోజులు ఆగు," అన్నాడు.

తర్వాత రాజు, చారులను పిలిపించి, గజబలుడి విషయంలో నిజం తెలుసుకు రమ్మని ఆజ్ఞాపించాడు. వాళ్ళు రెండు రోజుల్లో, వజ్రదేహుణ్ణి వెంటబెట్టుకువచ్చి, జరిగిన వాస్తవమేమిటో రాజుకు తెలియ చెప్పారు.

రాజుకు, వజ్రదేహుడి హుందాతనం, తీరుతెన్నులు చూడగానే, అతడు గొప్ప పరాక్రమవంతుడన్న నమ్మకం కలిగింది. రాజు, వెంటనే యువరాణి సుచిత్రతో, వజ్ర దే హు డి వివాహానికి సన్నాహాలు ప్రారంభించాడు.

అయితే, మర్నాడు నిండుసభలో మంత్రి భానువర్మ, "ప్రభూ, వజ్రదేహుడి విషయంలో, మీ నిర్ణయం తొందరపాటులా కనబడుతున్నది. మన రాజ్యంలో ఇతడి కన్న పరాక్రమవంతులు వుండవచ్చు గదా! క్షాత్రవిద్యల్లో పోటీ ఏర్పాటు చేయించండి," అన్నాడు.

ఇందుకు, సభలోని ప్రజలందరూ సమ్మతి తెలిపేసరికి, రాజు ఆ విధంగానే చాటింపు వేయించాడు.

ఆ మర్నాడు ప్రజలు, పోటీలు చూడ డానికి పెద్ద ఎత్తున గుమిగూడారు. అయితే, సాహసించి ఎవరూ గజబలుడంతటి రాక్షసుడితో తలపడ్డ వజ్రదేహుడితో కత్తి కలపడానికి ముందుకు రాలేదు.



ఒక పావుగంట కాలం గడిచింది. ఎవరూ ఊహించని విధంగా చంద్రవర్మ హఠాత్తుగా ముందుకు వచ్చి, వజ్రదేహుడి మీదికి కత్తి దూశాడు. అది చూసి రాజూ, యువరాణీలతో పాటు, అక్కడ చేరిన వాళ్ళందరూ నిశ్చేష్టులై పోయారు.

వజ్రదేహుడు, చంద్రవర్మ కేసి ఒక్క క్షణకాలం అసహ్యపడుతూన్నట్టు చూసి, చప్పున కత్తిదూసి, ఒక్క దెబ్బతో చంద్ర వర్మ చేతిలోని కత్తి దూరంగా పోయి పడేలా కొట్టాడు. అందరూ వజ్రదేహుడికి జయజయధ్వానాలు పలికారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మహాపరాక్రమవంతుడైన వజ్రదేహుణ్ణి

గురించే కాక, అతిభీరువైన చంద్రవర్మ ప్రవర్తనను గురించి కూడా, నాకు సందేహం కలుగుతున్నది. అసమర్థులా, పిరికివాళ్ళ ముఖాలు చూడడానికైనా అసహ్యపడే వజ్రదేహుడు, ఎరిగీ చంద్ర వర్మ మీద ఎందుకు కత్తి దూశాడు? అది ప్రతిజ్ఞాభంగం కాదా? రాకుమారి సుచిత్రను వివాహమాడి సింధూరదేశానికి రాజు కావాలన్న లోభంవల్ల అతడలా చేశాడా? వజ్రదేహుడి శక్తిసామర్థ్యాలు తెలిసి కూడా, పరమ పిరికివాడైన చంద్ర వర్మ, అతడితో హఠాత్తుగా కత్తి యుద్ధానికి ఎందుకు పూనుకున్నాడు? రాజకుమారిని వివాహమాడి తీరాలన్న దృఢనిశ్చయం, అతడిలో హఠాత్తుగా తెగింపూ, వీరలక్షణా లకు కారణం అయిందా? ఈ సందే హానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వజ్రదేహ చంద్రవర్మల ప్రవర్తన గురించి, సందేహ పడవలసిందేమీలేదు. ఇద్దరూ తమ, తమ స్వభావాలకు అనుగుణంగానే ప్రవర్తిం చారు. వజ్రదేహుడికి అసమర్థులా, పిరికి పందలపట్ల వున్న అసహ్యం కారణం గానే, అతడు ఒక రాజకుటుంబ గౌర వాన్నీ, దేశభవిష్యత్తునూ దృష్టిలో పెట్టు కుని చంద్రవర్మపై కత్తి దూశాడు. అది స్వార్థంవల్ల ఎంతమాత్రమూ కాదు. ప్రతిజ్ఞాభంగం అసలే లేదు. ఇక, చంద్ర వర్మ, తన తండ్రి కుటిలనీతి, కుతంత్రా లకు తల ఒగ్గాడు. కత్తిపట్టనే చేతకాని తాను, కత్తి దూయగానే వజ్రదేహుడు అసహ్యించుకుని, అక్కడి నుంచి వెళ్ళి పోతాడనీ—ఆ విధంగా తాను మహా పరాక్రమశాలిగా రుజువై, రాకుమారిని వివాహమాడవచ్చుననీ భావించాడు. అంతే కాని, హఠాత్తుగా కలిగిన తెగింపువల్ల కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఎదురుతిరిగిన పొగడ్త

శృంగేరి దేశాన్ని పరిపాలిస్తున్న, విజయశీలుడనే రాజు కొలువులో రమానందుడనేవాడు, రాజధానీ నగరానికి కొత్వాలుగా వుండేవాడు. విజయశీలుడికి, తనను పొగిడేవారంటే చాలా యిష్టం. ఈ సంగతి తెలిసిన రమానందుడు, అవకాశం దొరికినప్పుడల్లా రాజును తెగపొగడుతూ, ఆయనకు చాలా ఆప్తుడయ్యాడు.

రమానందుడికి ధనాశ ఎక్కువ. రాజుతో తనకున్న సాన్నిహిత్యాన్ని అవకాశంగా తీసుకుని, అతడు నగరంలోని ధనికవర్తకులను బెదిరించి డబ్బు గుంజేవాడు. లంచాలు పుచ్చుకుని కొందరు నేరస్థులను స్వేచ్ఛగా వదిలేవాడు. ఇవన్నీ మంత్రికి తెలుసు. కాని, రాజుకు రమానందుడిపట్ల గల ఆదరాభిమానాల కారణంగా, అతణ్ణి ఏమీ చేయలేకపోయేవాడు.

ఒకసారి దసరా ఉత్సవాల సందర్భంలో, రాజధానీ నగరంలో నాటక ప్రదర్శనలు జరిగినై. అందులో కొందరు రాజోద్యోగులతోపాటు, రమానందుడు కూడా పాల్గొన్నాడు. అతడు రాజు వేషం ధరించి, దాన్ని అద్భుతంగా పోషించి విజయశీలుణ్ణి మెప్పించాడు.

నాటకం ముగిశాక, రాజు విజయశీలుడు, రమానందుణ్ణి, దగ్గరకు పిలిచి, ''రాజు పాత్రను అంత సహజంగా, హుందాగా ఎలా పోషించగలిగావు?'' అని అడిగాడు.

అందుకు రమానందుడు, ''మహారాజా, ఏ పాత్రనయినా బాగా పోషించాలంటే, నిజజీవితంలో, ఆ పాత్ర తాలూకు వ్యక్తికి సన్నిహితంగా వుంటూ, అతడి ప్రవర్తనను జాగ్రత్తగా గమనిస్తూ వుండాలి. అప్పుడే ఆ పాత్రకు న్యాయం

కోలార్ కృష్ణ అయ్యర్

చేకూరుతుంది. నేను తరచూ తమ వద్దకు వచ్చిపోతూ వుంటాను గనక, ఒక ఆదర్శ ప్రాయుడైన రాజు ఎలా వుంటాడో ప్రత్య క్షంగా తెలుసుకుని, అలాగే నటించాను,'' అని జవాబిచ్చాడు.

ఆ జవాబుకు రాజు ఉప్పొంగిపోయి, తన కంఠహారం తీసి రమానందుడి కిచ్చాడు.

పక్కనే వుండి అంతా గమనిస్తున్న మంత్రి, చేయగలిగిందేమీలేక మౌనంగా వూరుకున్నాడు.

మరసటిరోజు ప్రదర్శించిన నాటకంలో, రమానందుడు, ఒక గజదొంగ వేషం వేశాడు. రాజుకు, యీ పాత్ర పోషణ కూడా ఎంతో అద్భుతం అనిపించి, వెంటనే అతణ్ణి దగ్గరికి పిలిచి, ''రమా నందా, నీవు గజదొంగగా కూడా చక్కగా నటించావు. ఎలా సాధ్యపడింది?'' అని ప్రశ్నించాడు.

రమానందుడు, ఏం జవాబు చెప్పాలో తోచక తికమకపడసాగాడు.

అక్కడే వున్న మంత్రికి, రమానందుడి నిజరూపం బయటపెట్టడానికి, ఇది మంచి అదనుగా తోచింది.

ఆయన రాజుతో, ''మహారాజా, నిన్న రమానందుడు, రాజు పాత్రను అంత బాగా పోషించినందుకు అతడు చెప్పిన కారణం, తమకు గుర్తుండే వుంటుంది. ఇతడికి ఒక గజదొంగతో స్నేహం వుండివుండాలి. లేకపోతే, ఈనాటి నాటకంలోని గజదొంగ పాత్రను అంత సహజంగా పోషించి వుండడు!'' అన్నాడు.

మంత్రి ఇలా అనేసరికి, రాజుకు అనుమానం కలిగి, రమానందుడికేసి తీవ్రంగా చూశాడు. అంతే రమానందుడు నిలువెల్లా వణికిపోతూ తల వంచు కున్నాడు.

రాజు, భటులచేత రమానందుణ్ణి బంధింపించి, కారాగారంలో వేశాడు. తర్వాత నగరంలో విచారించగా, రమా నందుడి విపరీతమైన అవినీతీ, లంచగొండి తనం బయటపడ్డాయి.



# చందమామ అనుబంధం—2
# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:
## సూరదాసు



సూరదాసు 1484 వ సంవత్సరం డిసెంబర్ 9 వ తేదీన జన్మించినట్టు చెబుతారు. భక్తి తత్వం ప్రబోధించిన సూరదాసు అంధుడు. అయినా, ఆయన గీతాలలోని వర్ణనలు కళ్ళకు కట్టినట్టు, చూపులేనివాళ్ళు అలా వర్ణించగలరా అన్న అనుమానం గలిగించే విధంగా సహజసుందరంగా వున్నాయి. బహుశా, తన మనోనేత్రాలతో సర్వాన్ని దర్శించి ఆయన గీతాలను రచించి వుంటాడు!

సూరదాసు జన్మస్థలం గురించి భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఆగ్రా, మధుర పట్టణాలకు మధ్య ఉన్న రునుక్తలో జన్మించాడని కొందరంటే, ఢిల్లీ సమీపంలోని సీహిలో జన్మించినట్టు మరికొందరు విశ్వసిస్తున్నారు. సూరదాసు తండ్రి అక్బరు ఆస్థానంలో సంగీత విద్వాంసుడని కొందరంటే; సూరదాసు పృధ్వీరాజ్ చౌహాన్ ఆస్థానకవి అయిన చంద్ బెర్దాయ్ వంశస్థుడని మరికొందరు అభిప్రాయపడుతున్నారు. సూరదాసు సోదరులు యుద్ధానికి వెళ్ళి తిరిగిరాలేదనీ; వాళ్ళను వెతుక్కుంటూ వెళ్ళిన సూరదాసు ప్రమాదవశాత్తు ఒక బావిలో పడిపోయి, ఆరురోజులు ఆ నూతిలోనే శ్రీకృష్ణ ధ్యానంలో గడిపి, అద్భుతమైన అనుభూతి పొంది వచ్చాడనీ చెబుతారు. ఆ తరవాత శ్రీకృష్ణుడి కల్యాణ గుణాలను పొగడుతూ, గీతాలాపన చేస్తూ జీవించసాగాడు. ఆయన రచించిన గీతాలు దాదాపు ఐదువేలకు పైగా 'సూరసాగర్' పేరుతో ప్రఖ్యాతిగాంచాయి.

సూరదాసు, తల్లిదండ్రులతో మధురక్షేత్రం సందర్శించి, అక్కడి వల్లభాచార్యులకు శిష్యుడయ్యాడని కూడా చెప్పుకుంటారు!

## ఎవరాయన?

సాయం సంధ్యాసమయం. మేతకు వెళ్ళిన పశువులు ఇళ్ళకు చేరుకుంటున్నాయి. పడమటి కొండల కవతల సూర్యుడు అస్తమిస్తున్నాడు. కనుచూపు మేరకు వరిపొలాలు. ప్రకృతి అంతా ప్రశాంతంగా ఉన్నది.

రెండు గ్రామాలకు మధ్య ఉన్న పొలాల కుండా, ఒక కుర్రవాడు దాపులనున్న నదికేసి నడుస్తున్నాడు. పడమటి ఆకాశంలో ఒక మేఘ శకలం అస్తమన సూర్యుడి బంగారు కిరణాలను ప్రతిఫలిస్తున్నది. శోభాయమానంగా ఉన్న ప్రకృతిని చూసి ఆ కుర్రవాడు ఆనందాశ్చర్యాలు చెందాడు. సృష్టిలోని అందచందాలను ఆస్వాదించ డానికి అవకాశం కలుగజేసిన దేవుడికి మనసులో కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

కొంతసేపటికి పక్షులు కొన్ని గుంపుగా, ఆకాశంలోని మేఘశకలాన్ని దాటుకుని వెళ్ళాయి. గంభీర వాతావరణంలో ఆ సుందర దృశ్యాన్ని చూడగానే పరవశించిపోయాడా కుర్రవాడు. బయటి ప్రపంచాన్నంతా మరచిపోయి అక్కడే నిలబడిపోయాడు; అవ్యక్తానుభూతిని కలుగజేసే సమాధిస్థితి అనే స్థాయికి చేరుకున్నాడతడు. తరవాతి జీవితంలో కూడా అతనికి అటువంటి అనుభూతి తరచూ ఏర్పడేది. అతడు మహాపురుషుడుగా పేరుగాంచాడు. ఎవరాయన? (VIII పేజీ చూడండి)

# విజ్ఞాన వినోదం







## నేత్ర ప్రవర్తన

సూచనలు :

బాగా వెలుతురు ఉన్న గదిలో కూర్చుని, మీ మిత్రుణ్ణి కళ్ళు మూసుకోమనండి. ఒకటి రెండు నిమిషాలు అలాగే వుండి ఆ తరవాత కళ్ళు తెరవమనండి. ఇప్పుడు అతని కళ్ళలోకి చూడండి. వెలుపలి వెలుతురుకు అనుగుణంగా అతని కళ్ళు ఎలా మార్పు చెందుతాయో జాగ్రత్తగా పరిశీలించండి.

ఏం జరుగుతుంది ? ఎలా జరుగుతుంది ?

మిత్రుడు కళ్ళు తెరవగానే అతడి కనుపాపలు కాస్త పెద్దవిగా కనిపిస్తాయి. కాని క్రమ క్రమంగా కుంచించుకునిపోయి చిన్నవిగా కనిపిస్తాయి. ఇలా ఎందుకు జరుగుతుంధో తెలుసుకుందాం. ఇలా జరగడానికి కారణం కనుపాపచుట్టూ వలయాకారంగా ఉన్న 'ఐరిస్' అనే పలుచటి కండరం. వెలుపల ఉన్న కాంతికి తగినవిధంగా ఈ ఐరిస్ మార్పు చెంది, ఎక్కువ వెలుతురు ఉన్నప్పుడు కనుపాపను కొంతవరకు మూసుకుంటుంది. అందువల్ల మనకు కనుపాప చిన్నదిగా కనిపిస్తుంది.

ఆటోమేటిక్ లెన్స్ అడ్జస్టమెంట్ గల కెమెరాలో వున్న డయాఫ్రమ్ లాగా మన కళ్ళల్లో ఐరిస్ పనిచేస్తున్నది. వెలుతురు స్వల్పంగా ఉన్నప్పుడు, బాగా తెరుచుకుని ఎక్కువకాంతి లోపలికి వెళ్ళడానికీ, వెలుతురు ఎక్కువగా ఉన్నప్పుడు కొంతవరకు మూసుకుపోయి అవసరమైనంత వెలుతురు మాత్రమే లోపలికి వెళ్ళడానికీ ఇది దోహదం చేస్తుంది. ఉన్నట్టుండి ఎక్కువ కాంతి గల గదిలోకి ప్రవేశించినట్టయితే, అక్కడి వెలుతురుకు తగిన విధంగా కళ్ళు మారేంతవరకు, కళ్ళు కనిపించవన్న విషయం మనకందరికీ అనుభవమే.

మానవనేత్రాలలోని ఐరిస్‌లాగానే, పిల్లి కళ్ళలోని ఐరిస్ కూడా పనిచేస్తుంది. కాని, మనిషి కంటిలో లాగా వెలుతురు లోపలికి పోనీయకుండా మూసుకుపోదు. పిల్లి కంటిలో ఐరిస్ చెందే మార్పును పరిశీలించి చూసినట్టయితే, దాని కనుపాప ఆకార నిర్మాణం భిన్నంగా ఉండడం గమనించవచ్చు.

కుక్క కళ్ళలోని ఐరిస్ కూడా పిల్లి కళ్ళలోని ఐరిస్ లాగానే పనిచేస్తుందా? పరిశీలించి చూసి తెలుసుకోవడానికి ప్రయత్నించండి.





## బాబిలోన్ ఉద్యానవనాలు

అసీరియా యువరాణి సిమిరమిస్ పుట్టుక గురించి ఒక వింత కథ ప్రచారంలో ఉన్నది: మత్స్యదేవత కూతురైన సిమిర మిస్‌ను పావురాలు పెంచాయి; సిరియా రాజు గొర్రెలకాపరి ఆ వింతను చూసి, ఆమెను రాజభవనానికి తెచ్చాడు. కొన్నాళ్ళకు రాజు ఆమెను వివాహమాడాడు. రాజు మరణానంతరం ఆమె సింహాసనాన్ని అధిష్ఠించి వివిధ దేశాలను జయించింది. భారతదేశాన్ని మాత్రం జయించలేక పోయామన్న విచారం ఆమెకు ఉండేదట!

ఆమె ఎన్నో బ్రహ్మాండమైన కట్టడాలను నిర్మించింది. దుర్గమమైన కొండల మీదికి బాటలు వేయించింది. హేంగింగ్ గార్డెన్స్‌గా ప్రపంచ ప్రసిద్ధిగాంచిన బాబిలోన్‌లోని అందాల ఉద్యానవనాలను కూడా ఆమె సృష్టించిందని చెబుతారు.

700 అడుగుల పొడవు, వెడల్పులతో చతురస్రాకారాలుగా ఉద్యానవనం నిర్మించబడింది. బ్రహ్మాండమైన స్తంభాలు ఆధారంగా, అంతస్థుమీద అంతస్థు ఏర్పాటు చేయబడి వుండడంవల్ల ఇది ఎంతో ఎత్తుగా ఉన్నది. దీనికి యేడాది పొడవునా నీటి సరఫరా జరిగే అద్భుతమైన ఏర్పాటు చేయబడి ఉన్నది. ఆ కారణంగా ఉద్యాన వనంలోని చెట్టు చేమలు ఎల్లప్పుడూ పచ్చగా కళకళలాడుతూ వుంటాయి.

సిమిరమిస్ అనే చారిత్రకవ్యక్తి క్రీ॥ పూ॥ 8 వ శతాబ్దంలో జీవించినట్టు ఆధారాలు ఉన్నాయి.

క్రీ॥ పూ॥ 6 వ శతాబ్దంలో అసీరియాను పరిపాలించిన నెబుచాడ్‌నెజార్ అనే రాజు—ఈ హేంగింగ్ గార్డెన్స్‌ను నిర్మించినట్టు, మరికొందరు అభిప్రాయపడుతున్నారు.

రాజుగారి రాణులలో ఒకరు పర్వత ప్రాంతం నుంచి వచ్చారట. ఆమెకు పుట్టింటి పచ్చటి వాతావరణం కల్పించడానికి రాజు ఈ ఉద్యానవనం నిర్మించినట్టు చెబుతారు.



గొప్ప చారిత్రక ఘట్టాలు

# చైనానుంచి వచ్చిన

ప్రపంచ చరిత్ర చాలా ప్రాచీనమైనది చరిత్ర నడిచిన అడుగుజాడలను తెలుసుకోవడానికి మనకు కొన్ని ఆధారాలు ఉన్నాయి. అటువంటి ఆధారాలలో ముఖ్యమైనది యాత్రికుల రచనల రూపంలో ఉన్న. వారి అనుభవాలు.

పూర్వకాలంలో ప్రయాణాలు చేయడం కష్టసాధ్యమైన కార్యం. చాలా అపాయకరమైనది కూడా. అయితే, ఆ రోజులలో ప్రయాణం చేయడం, ఈనాటికన్నా, చాలా అద్భుతమైన అనుభూతిని కలిగించగలిగేది. అయినా, ఇప్పటిలా వినోదం కోసం ఆ రోజుల్లో ప్రయాణాలు చేసేవారు కాదు. వర్తక వాణిజ్యాలకోసం, లేదా జ్ఞాన సముపార్జనకోసం మాత్రమే ప్రయాణాలు చేసేవారు.

జ్ఞానసముపార్జనకోసం, చైనానుంచి మనదేశానికి 7వ శతాబ్దంలో ఒక బౌద్ధ పండితుడు వచ్చాడు. అయన పేరు హుయాన్‌త్సాంగ్. బౌద్ధమతం గురించి కూలంకషంగా తెలుసుకోవడానికి అతడు మన దేశానికి వచ్చాడు. తన ప్రయాణం గురించీ, భారతదేశంలో చూసినవిశేషాలను గురించీ వివరిస్తూ ఆయన రచన చేశాడు.

అపాయకరమైన గోబీ ఎడారిని దాటుకుని, వెంట్రుకవాసిలో చావునుంచి



# గొప్ప యాత్రికుడు



''అతడొక బౌద్ధ భక్తుడు. బౌద్ధమతం పుట్టిన భూమిని దర్శించి, ఆ మతానికి సంబంధించిన పవిత్ర గ్రంథాలను తీసుకు పోవడానికి అతడు వచ్చాడు. గోబీ ఎడారి దాటి, తాష్కండ్, సమర్కండ్, బాక్, ఖొటాన్, యార్కండ్ మొదలైన నగరాల గుండా ప్రయాణం చేసి మన దేశానికి వచ్చి, దేశమంతటా పర్యటించాడు. బహుశా సింహళాన్ని కూడా దర్శించాడేమో. యాత్రా సమయంలో చూసిన ప్రదేశాల గురించీ, కలుసుకున్న వ్యక్తుల గురించీ అతడు తన గ్రంథంలో అద్భుతంగా వర్ణించాడు. మనదేశం వివిధ ప్రాంతాలలో అతడు చూసిన మనుషులను గురించి చెప్పిన విషయాలు కొన్ని ఈనాటికీ నిజంగానే వుంటున్నవి. అతడు విన్న అద్భుతమైన కథలూ, బుద్ధుడికీ, బోధి సత్త్వులకూ సంబంధించిన ఎన్నో అద్భుత గాథలూ ఆయన గ్రంథస్థం చేశాడు.

ఆయన భారతదేశంలో, ముఖ్యంగా పాటలీపుత్రానికి సమీపంలోని నలందా విశ్వవిద్యాలయంలో చాలా సంవత్సరాలు గడిపాడు. బౌద్ధారామమూ, విశ్వవిద్యాలయమూ అయిన నలందలో 10 000 మంది విద్యార్థులూ, బౌద్ధ సన్యాసులూ ఉండేవారని చెబుతారు. వైదిక విద్యకు కేంద్రంగా వెలసిన కాశికి పోటీగా, నాడు రూపొందించబడిన గొప్ప బౌద్ధ విద్యా కేంద్రమే నలందా విశ్వవిద్యాలయం.''

బయటపడి, అతడు అద్భుతమైన టార్ఫాన్ నగరం చేరుకున్నాడు. ఆనాడు ఆనగరం బౌద్ధమతం సంస్కృత భాషా ప్రభావాల కారణంగా గొప్ప సంస్కృతికి కేంద్రమై ఉండేది (నగరం ఇప్పటికీ ఉన్నది గాని ఆనాటి చిహ్నాలేవీ కనిపించవు).

ఆయన భారతదేశం చేరుకుని ఆనందాశ్చర్యాలకు లోనయ్యాడు. బుద్ధుడి జన్మభూమిలో అడుగు పెట్టినందుకు ఆనందమూ, దేశ సంస్కృతీ వైభవాన్ని చూసి ఆశ్చర్యమూ చెందాడు. ఆనాడు హర్షవర్ధనుడు భారతదేశంలో సువిశాల సామ్రాజ్యాన్ని పరిపాలించేవాడు.

ప్రపంచ చరిత్ర (గ్లింప్సస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ) అన్న గ్రంథంలో జవహర్‌లాల్ నెహ్రూ, ఆ మహాయాత్రికుణ్ణి గురించి ఇలా రాశాడు:

## గత చరిత్రలోకి చూద్దాం



1. ఢిల్లీని పరిపాలించిన ఆఖరి హైందవరాజు ఎవరు?
   (ఎ) అతనికి సంబంధించిన ప్రేమ కథ ఎట్టిది?
   (బి) అతనికి శత్రువుగా మారిన హైందవరాజు ఎవరు?
   (సి) ఆ శత్రువుకు ఏం జరిగింది?
2. మరణ శయ్యపైనుండి, తన కుమార్తెను వారసురాలుగా రావాలని కోరుకున్న ఢిల్లీ పాలకుడెవ్వరు?
   (ఎ) అతని కుమార్తె పేరేమిటి?
   (బి) ఆమె ఎవరిని వివాహమాడింది?
   (సి) ఆ దంపతులకు ఏమయింది?
3. 18 శతాబ్దారంభంలో ఢిల్లీపై దురాక్రమణ జరిపి, 30,000 మందిని హతమార్చిన వాడెవ్వరు?
   (ఎ) అనాటి ఢిల్లీ పాలకుడెవ్వరు?
   (బి) అతడు తరలించుకుపోయిన ప్రసిద్ధిగాంచిన సింహాసనం ఏది?
   (సి) అతడు పట్టుకుపోయిన మరొక అమూల్య వస్తువు ఏది? ఎలా పట్టుకుపోయాడు?

(VIII పేజీ చూడండి)

## మన లోకజ్ఞానం పరీక్షించుకుందాం

1. 1988వ సంవత్సరంలో, మన దేశంలోని ఒక రైల్వేస్టేషన్ కట్టడం వంద సంవత్సరాలు పూర్తిచేసుకున్నది. దాని పేరేమిటి? దానికాపేరు ఎందుకు పెట్టారు?
2. 'హెమ్లాక్' అనే విషాన్ని పాశ్చాత్య తత్వవేత్తకు ఇచ్చారు. ఆయన పేరేమిటి?
3. ఘానా స్వతంత్రం కావడానికి పూర్వం దానిపేరేమిటి?
4. రాజకీయ పరిభాషలో జాతీయ (నేషనలిస్ట్) చైనా అని పిలువబడే దేశం పేరేమిటి?
5. బెనెలక్స్ దేశాలుగా చెప్పబడే దేశాలు ఏవి?
6. చంద్రుడికీ, భూమికీ మధ్య ఉన్న దూరం ఎంత?
7. ఆధునిక పదజాలంలో 'కాస్మిక్ ఇయర్' అంటే ఏమిటి?
8. ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద దేశం ఏది?
9. ప్రపంచంలోకెల్లా అతి చిన్నదైన స్వతంత్ర ప్రాంతం ఏది?
10. నక్షత్రవీధి (గాలక్సీ) అంటే ఏమిటి?

(VIII పేజీ చూడండి)




1. ఒక ప్రాచీన సంస్కృత నాటకకర్త రచనలు కనిపించకుండా పోయాయి. అవి 1912 వ సంవత్సరంలో కనుగొనబడినవి. ఆ నాటకకర్త ఎవరు?
   (ఎ) వాటిని ఎవరు, ఎక్కడ కనుగొన్నారు.
   (బి) అవి ఎన్ని?

2. మరణరహస్యం గురించి వివరించమని యముణ్ణి అడిగిన కుర్రవాడెవడు?
   (ఎ) ఆ కథ ఎందులో ఉన్నది?
   (బి) ఆ మాటకు అర్థం ఏమిటి?

3. వాల్మీకి రామాయణాన్ని అనుసరించి రచింపబడిన రెండు సుప్రసిద్ధ రామాయణాలు ఏవి?

4. సుప్రసిద్ధమైన ప్రాచీనకథల సంకలనంలో వచ్చే రాజు పేరేమిటి?
   (ఎ) ఆ కథాగుచ్ఛం పేరేమిటి?
   (బి) ఆ కథలకు ఆధారగ్రంథం ఏది?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: మనిషి

అస్సామీ: మనుష; బెంగాలీ: మనుష్; ఇంగ్లీష్: మేన్; గుజరాతీ: మనస్; హిందీ: ఆద్మి; కన్నడం: మనుష్య; కాశ్మీరీ: మహన్యు; మలయాళం: మనుష్యన్; మరాఠీ: మనుస్; ఒరియా: మనిష; పంజాబీ: మనుష్; సంస్కృతం: మానవ; సింధి: మన్‌హన్; తమిళం: మనిదన్; ఉర్దు: ఆద్మీ.

## మీరు నమ్ముతారా?

1. రామాయణాన్ని పూర్తిగా వాల్మీకి రచించాడా?
2. ఫ్రాంకెన్‌స్టీన్ ఒక భయంకర భూతమా?
3. భూమండలంలో నివసించిన జంతువులలోకెల్లా ఆకారంలో పెద్దవి రాక్షసబల్లులేనా?

### కానే కాదు!

1. సీతా పరిత్యాగాన్ని వివరించే ఉత్తరకాండను మరొక కవి రచించాడు. దాని శైలి భిన్నంగా ఉన్నది. దానిని రచించినవారు కూడా గొప్పకవి అనడంలో సందేహంలేదు.
2. మేరీషెల్లీ రచించిన ఫ్రాంకెన్‌స్టీన్ నవలలోని ప్రధాన పాత్ర అయిన ఒక విజ్ఞాన పరిశోధకుడి పేరు. అతడు శవాల అవయవాలను ఒకటిగా అతికించి వాటికి ప్రాణంపోస్తాడు. అది ఒక భూతంగా లేచి ప్రాణంపోసినవాణ్ణే హతమారుస్తుంది. అయితే కాలక్రమేణా ఫ్రాంకెన్‌స్టీన్ అంటేనే భూతం అనే అర్థం ఏర్పడింది.
3. ముప్పైమీటర్ల పొడవూ, 175 టన్నుల బరువూ గల తిమింగిలం (బ్లూవేల్) అన్ని ప్రాణులకన్నా చాలా పెద్దది.

# సమాధానాలు

### ఎవరాయన?

బాల్యంలో గదాధరుడుగా పిలువబడిన శ్రీరామకృష్ణపరమహంస.

### చరిత్ర

1. పృథ్వీరాజ్ చౌహాన్.

(ఎ) స్వయంవరం జరుగుతూన్న సమయంలో, సంయుక్త అతనితోపాటు గుర్రం మీద వెళ్ళి, అతణ్ణి పెళ్ళాడింది. (బి) కనూజ్‌ను పరిపాలించిన సంయుక్త తండ్రి జయచంద్రుడు. (సి) జయచంద్రుడు మహమ్మద్ ఘోరీతో చేతులు కలిపి, ఢిల్లీ పైకి దండెత్తిరమ్మని అతన్ని పురికొల్పాడు. పృథ్వీరాజ్ చేతిలో ఓడిపోయిన ఘోరీ అతని బందీ అయి, ఆ పిమ్మట విడుదల అయ్యాడు. 1192 సంవత్సరంలో మళ్ళీ ఢిల్లీపైకి దండెత్తి వచ్చి పృథ్వీరాజును హతమార్చాడు. అయినా, మరు సంవత్సరమే మహమ్మదు ఘోరీ జయచంద్రుణ్ణి కూడా హతమార్చి, కనూజ్‌ను వశపరచుకున్నాడు.

2. ఇల్టుమిష్.

(ఎ) రజీయా సుల్తానా. (బి) అల్టునియా నాయకత్వంలో సామంతసర్దారులు ఆమె మీద తిరుగుబాటు జరిపారు. అయినా, ఆ పిమ్మట రజీయా అల్టునియాను ప్రేమించి అతన్ని పెళ్ళాడింది. (సి) తిరుగుబాటు జరిపిన సామంతసర్దారులు, ఇరువురినీ హతమార్చారు.

3. పర్షియాకు చెందిన నాదిర్షా.

(ఎ) మొగల్ వంశానికి చెందిన మహమ్మద్ షా (బి) మయూర సింహాసనం (సి) కోహినూర్ వజ్రం. మొగల్ చక్రవర్తి దానిని తలపాగాలో దాచాడు. తలపాగాలు మార్చుకుందామన్న సాకుతో, నాదిర్షా విలువైన వజ్రాన్ని తనవశం చేసుకున్నాడు.

### లోకజ్ఞానం

1. విక్టోరియా టెర్మినస్. విక్టోరియారాణి స్వర్ణోత్సవాల సందర్భంగా ఇది నిర్మించబడింది.

2. సోక్రటీసు.

3. గోల్డ్‌కోస్ట్.

4. తాయ్‌వాన్ లేదా ఫార్మోసా.

5. బెల్జియం, నెదర్లాండ్స్, లక్సెంబర్గ్.

6. 2,38,855 మైళ్ళు.

7. సూర్యుడు సెకండుకు 250 కి. మీ. వేగంతో గాలక్సీ (నక్షత్రవీధి) కేంద్రాన్ని ఒక్కసారి చుట్టిరావడానికి 250 మిలియన్ సంవత్సరాలు పడుతుంది, ఈ కాలాన్నే కాస్మిక్ ఇయర్ అంటారు.

8. సోవియట్ రష్యా.

9. వాటికన్ సిటీ.

10. ఆకర్షణశక్తి కారణంగా పెద్ద నక్షత్ర సమూహం ఒకటిగా ఉండడం.

### సాహిత్యం

1. క్రీ॥ పూ॥ 5 లేదా 6 వ శతాబ్దానికి చెందిన భాసుడు.

(ఎ) కేరళకు చెందిన పండిత గణపతి శాస్త్రి. (బి) పదమూడు.

2. నచికేతుడు.

(ఎ) ఒక ఉపనిషత్తులో. (బి) ఉపనిషత్ అంటే దగ్గరగా కూర్చోవడం అని అర్థం. గురువుకు దగ్గరగా రాగల శిష్యులకు మాత్రమే విద్య బోధింపబడేది అన్నదే దీని అంతరార్థం.

3. తమిళంలో కంబన్ రచించిన కంబ రామాయణం; హిందీలో తులసీదాసు రచించిన శ్రీరామచరితమానస్.

4. విక్రమాదిత్యుడు.

(ఎ) బేతాళ పంచవింశతి. (బి) కథా సరిత్సాగరం.



కావ్యకథలు:

# మణిమంజీరం-4

పూంపుహార్ నగరానికి చెందిన వర్తకుడు కోవలన్, తన భార్య కణ్ణగిని వదలి, నర్తకి మాధవి సాహచర్యంలో కొంత కాలం గడిపాడు. ఆ తరవాత తప్పు తెలుసుకుని, భార్యవద్దకు తిరిగి వచ్చాడు. కణ్ణగి, కోవలన్ దంపతులు పూంపుహార్ వదిలిపెట్టి, బ్రతుకుతెరువు వెతుక్కుంటూ మధురై చేరుకున్నారు.

కోవలన్ తన భార్య కణ్ణగి ఇచ్చిన కాలి అందెలలో ఒకదానిని విక్రయించి, ఆ సొమ్ముతో కొత్తవ్యాపారం ప్రారంభించాలనుకున్నాడు. అందెను తీసుకు వెళ్ళి రాజుగారి ఆస్థాన స్వర్ణకారుడికి చూపాడు. అంతటి విలువైన కాలిఅందె కోవలన్ దగ్గర వుండడం చూసి స్వర్ణకారుడు అమితాశ్చర్యం చెందాడు.





ఆ సమయంలోనే రాణిగారి కాలిఅందె ఒకటి దొంగిలించబడింది. స్వర్ణకారుడే ఆ దొంగతనం చేసి వుంటాడని అందరూ అనుమానించారు. కోవలన్ దగ్గర విలువైన అందెను చూడగానే, స్వర్ణకారుడు అదే రాణిగారి అందె అని రాజుకు చెప్పి, తాను దొంగను పట్టి ఇవ్వగలనన్నాడు.



రాజు, స్వర్ణకారుడి మాటలు నమ్మి, అనాలోచితంగా తొందరపాటుతో, "రాణి గారి అందెను దొంగిలించిన ఆ దొంగను హతమార్చండి," అని భటులను ఆజ్ఞాపించాడు.

భటులు స్వర్ణకారుడి వెంట వెళ్ళి, కోవలన్‌ను చూశారు. అతని వద్ద స్వర్ణకారుడు చెప్పిన అందె వుండడంతో అతణ్ణి బంధించి తీసుకువచ్చి, రాజాజ్ఞ ప్రకారం మరణదండన నెరవేర్చారు.





తన భర్త ధనంతో తిరిగి వస్తాడని ఎదురు చూస్తూన్న కణ్ణగి, అతని మరణ వార్త విని దిగ్భ్రాంతి చెందింది. "దేవుడే లేడా? ఈ నగరంలో నీతి వంతులే కరువయ్యారా?" అని రోదిస్తూ కోపావేశంతో నగరంలోకి ప్రవేశించింది.

ఆమె ఆగ్రహావేశం చూసి, నగర ప్రజలు అమితాశ్చర్యంతో ఆమె చుట్టూ చేరారు. ఆమె వేదనాస్వరం విని, ఆమె భర్త విషయంలో రాజు పొరబాటు చేసి వుంటాడని ప్రజలు గ్రహించారు. అందరూ భయభ్రాంతులయ్యారు.





కణ్ణగి రాజసభను చేరుకుని తనవద్ద వున్న రెండవ అందెను రాజుకు చూపి, “నిరపరాధి అయిన నా భర్తకు మరణ దండన విధించావే! నా కాలి అందెలో ఉన్నవి మాణిక్యాలు!” అంటూ అందెను నేలకేసి కొట్టింది. అందె పగిలి అందులోని మాణిక్యాలు చెల్లాచెదరయ్యాయి. రాణిగారి అందెలో వున్నవి ముత్యాలు! ఆ దృశ్యం చూసి రాజు హతాశుడై, ఆ క్షణమే ప్రాణాలు వదిలాడు!

రాజు మరణించడంతో, ఆ దృశ్యం చూసి తట్టుకోలేక రాణి, స్పృహతప్పి పడిపోయింది. ఒక నిరపరాధికి శిక్ష విధించామే అన్న బాధతో రాజు మరణించాడు. రాజు మరణించాక, ఇక జీవించలేక రాణి ప్రాణాలు వదిలింది.





ఇంత జరిగాక కూడా, కణ్ణగి ఆగ్రహావేశం చల్లారలేదు. ఆమె నగరాన్ని మూడుసార్లు చుట్టి వచ్చింది. అధర్మపరుడైన రాజు పాలించే నగరం దుర్మార్గులకే నిలయమవుతుందని ఆమె భావించి, ఆ నగరం మంటలలో భస్మీపటలం కావాలని శపించింది.

హఠాత్తుగా నగరం మంటలపాలయింది. పవిత్రులనూ, ఉత్తములైన స్త్రీ పురుషులనూ, వృద్ధులనూ, పిల్లలనూ, వికలాంగులనూ, పశువులనూ రక్షించమని, కణ్ణగి అగ్నిదేవుణ్ణి ప్రార్థించింది. ఆ విధంగా వాళ్ళందరూ గండం నుంచి బయటపడ్డారు.






కణ్ణగి, కోవలన్ దంపతులు ఒక దివ్యరథంలో కూర్చుని స్వర్గానికి వెళ్ళడం అదృష్టవంతులైన ఉత్తములు కొందరు చూశారట. కణ్ణగి ఆదర్శపత్నిగానే కాకుండా దేవతగా కూడా పూజింపబడుతున్నది. నీతీ, నిజాయితీకి గల శక్తికి ప్రతీకగా ఆమె వెలుగొందుతున్నది!

—(అయిపోయింది)




# పిశాచాల సందేహం

విద్యాధరపురానికీ, వైశాలీనగరానికీ మధ్య వున్న దట్టమైన అడవిలో, కాలి బాటకు పక్కన వున్న ఒక మర్రిచెట్టు మీద, రెండు కొంటె పిశాచాలుండేవి.

అ రెండు పిశాచాల్లో ఒకటి వృద్ధ పిశాచంకాగా, రెండవది కుర్రపిశాచి. కాలిబాట వెంట వచ్చే మనుషుల ముఖాలను వృద్ధపిశాచి పరీక్షగా చూసి, వాళ్ళ బలహీనత ఏమిటో చెప్పగలిగేది. ఆ బలహీనతకు అనుగుణంగా కుర్రపిశాచి వాళ్ళను ఆకర్షించి ఆటపట్టించేది.

ఒకరోజున, ఆ రెండు పిశాచాలూ చెట్టు కొమ్మమీద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్న సమయంలో, అన్నిటికన్నా పెద్ద బలహీనత ఏది? అన్న విషయం చర్చకు వచ్చింది.

అప్పుడు వృద్ధపిశాచి, "ఎవరి బలహీనతవల్ల, వారి చుట్టుపక్కల వున్న వాళ్ళందరికీ మనస్తాపం కలుగుతుందో, అదే పెద్దబలహీనత!" అన్నది.

అయితే, ఆ బలహీనత ఏదన్న విషయంలో, రెండు పిశాచాలూ ఏకాభిప్రాయానికి రాలేక వాదులాడుతుంటున్న సమయంలో, కాలిబాట వెంట ఒక మనిషి రావడం, వాటి కంటబడింది. వృద్ధపిశాచి, ఆ మనిషి ముఖంలోకి పరీక్షగా చూసింది. కాని, అతడి బలహీనత ఏమిటో దానికి అంతుపట్టలేదు. కారణం అతడి ముఖం చాలా గంభీరంగా వున్నది.

వృద్ధపిశాచి ఏమీ చెప్పకపోయేసరికి, కుర్రపిశాచి ఒక డబ్బు సంచీని సృష్టించి, కాలిబాట మధ్యలో పడవేసింది. దారే వస్తున్న మనిషి, దాన్ని తీసుకునే ప్రయత్నం చేయక, "పాపం, ఎవరో డబ్బు సంచీని యిక్కడ పారేసుకున్నారు!" అనుకుంటూ ముందుకు సాగిపోయాడు.

అయ్యగారి శర్మ




అది చూసి, పిశాచాలు రెండూ నిరుత్సాహపడ్డాయి. ఇంతవరకూ అందరూ కూడా డబ్బుసంచీని చూడగానే తబ్బిబ్బు పడేవాళ్ళు. తర్వాత తలతిప్పి చుట్టు పక్కల చూసి, డబ్బు సంచీని దుస్తుల మాటున దాచుకుని, ఎవరూ లేనిచోట సంచీని విప్పేవాళ్ళు. అప్పుడు సంచీలో రాళ్ళో, తేళ్ళో వుండేలా చేసి, వాళ్ళ భయం చూసి పిశాచాలు రెండూ పొట్ట చెక్కలయేలా నవ్వుకునేవి.

ఈ వచ్చినవాడు, డబ్బు సంచిని వదిలి ముందుకు సాగిపోవడంతో, కుర్రపిశాచికి పట్టుదల పెరిగింది. వెంటనే అది చెట్టు దిగి, అపురూప సౌందర్యవతిలాగా రూపం ధరించి, ఒయ్యారంగా ఆ మనిషికి ఎదురు వచ్చింది.

అయితే, ఆ మనిషి ఆమెను చూసి పక్కకు తప్పుకుని వెళ్ళిపోసాగాడు. ఆమె కాలిలో ముల్లు గుచ్చుకున్న దానిలాగా, "అబ్బా!" అంటూ కూలబడి పోయింది.

ఆ మనిషి వెనక్కు తిరిగివచ్చి, చక్కని యువతిరూపంలో వున్న కుర్ర పిశాచి కాలిలోని ముల్లును తీసేశాడు. ఆ మరుక్షణం, యువతి అతడి చేయి పుచ్చుకుని, ఎక్కడలేని ప్రేమ నటిస్తూ, "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నన్ను పెళ్ళి చేసుకో!" అన్నది.

దానికతడు చిరాకుపడుతూ, "చిన్న ముల్లు తీయగానే, నా వెంటపడ్డావు. రేపు మరెవడో ఇంతకంటే పెద్ద ముల్లు తీస్తే, వాడి వెంట పోతావు. నా కిలాంటి ప్రేమలంటే చెడ్డచిరాకు!" అంటూ వెళ్ళి పోయాడు.

నిరుత్సాహంగా తిరిగి వచ్చిన కుర్ర పిశాచితో, వృద్ధపిశాచి, "అతణ్ణి నేను ఆట పట్టిస్తాను చూడు!" అంటూ మాయమైంది.

ఆ మనిషి అలా నడిచిపోతూండగా, ఒక పొదచాటు నుంచి, "దాహం, దాహం," అన్న మూలుగులు వినిపించాయి.

అతడు ఆగి చూడగా, మహారాజు దుస్తుల్లో వున్న ఒక వ్యక్తి, అక్కడ పడి వున్నాడు. ఆయన ఒంటినిండా గాయాలు.

వెంటనే అతడు తన సంచీలోంచి మర చెంబొకటి తీసి, నీళ్ళను దాహం అంటున్న వ్యక్తి నోటిలో పోశాడు.

కొంతసేపటికి రాజులా వున్న వ్యక్తి తేరుకుని, "మీరు, నా ప్రాణం కాపాడిన మహానుభావులు! నేనీదేశాన్నేలే రాజును. వేటకు వచ్చి, యిలా గాయపడ్డాను. మీరు, నా వెంట రాజధానికి రండి. మీకు గొప్ప పదవీ, కీర్తీ లభించేలా చూస్తాను," అన్నాడు.

అందుకు దారేపోయేమనిషి, "దాహంతో వున్నవారిని సేదతీర్చడం, మానవధర్మం. నాకే ప్రతిఫలమూ అక్కర్లేదు," అని తన దారిన తాను వెళ్ళసాగాడు.

అతడు అలా వెళ్ళగానే, క్షుద్రపిశాచి మహారాజు వేషంలో వున్న వృద్ధపిశాచి దగ్గిరకు వచ్చి, "ఇతనెవరో, ఏ బలహీనతా లేని మనిషిలా వున్నాడు," అన్నది.

దానికి వృద్ధపిశాచి, "లోకంలో, ఏదో ఒక బలహీనతలేని మనిషంటూ వుండడు. ఇప్పుడతణ్ణి మనుష్యరూపంలో వెంబడించి, అతడి బలహీనత ఏదో తెలుసుకుందాం, పద!" అన్నది.

వెంటనే అవి రెండూ తండ్రీ కొడుకుల్లాగా రూపాలు ధరించి బయలుదేరాయి. వాటికి ఒక చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటున్న, బాటసారిమనిషి కనిపించాడు. పిశాచాలు ప్రయాణీకుల్లాగా నటిస్తూ, అతడి పక్కనచేరి, అతణ్ణి మాటల్లోకి దించాయి.




కొద్దిసేపట్లోనే, ఆ మనిషి అడవి ప్రయాణంలో, తనకు కలిగిన అనుభవాలను గురించి వాటికి చెప్పసాగాడు.

దారిలో తనకు డబ్బు సంచీ కనబడడం, అందమైన యువతి తారసపడడం, మహారాజు దాహం తీర్చడం— ఇవన్నీ పిశాచాలకు పూసగుచ్చినట్టు చెప్పాడు. ఇవన్నీ తెలిసినవే అయినా, పిశాచాలు రెండూ వింతకనబరుస్తూ విన్నాయి.

అంతా చెప్పాక, ఆ మనిషి పిశాచాలను, "ఇప్పుడు చెప్పండి! నాలాగా ధనదాహం, అందంపట్ల వ్యామోహం, కీర్తి

కాంక్ష లేనివాణ్ణి ఎక్కడైనా చూశారా ?'' అని అడిగాడు.

''చూడలేదు ! చూడలేదు !'' అన్నవి పిశాచాలు రెండూ ఏకకంఠంగా.

ఆ జవాబుకు అతడు సంతృప్తిపడి, తన చిన్ననాటి విషయాలు వాటికి చెప్ప సాగాడు. తనకున్న మంచి గుణాలనూ, వాటి సాయంతో జీవితాన్ని తానెలా తీర్చి దిద్దుకున్నదీ, అంచెలంచెలుగా వివరించడం మొదలుపెట్టాడు.

పిశాచాలు రెండూ, చాలాసేపు ఓపికగా విన్నాయి. కాని, ఆ మనిషి తనను గురించి గొప్పగా చెప్పుకోవడం ఆపలేదు. క్రమంగా పిశాచాలకు ఓపిక పోయి, మెదడు స్తంభించి, కడుపులో తిప్పడం మొదలుపెట్టింది. మరి కాసేపటికి చెవులు గింగుర్లెత్తడం, కళ్ళవెంట నీళ్ళు కారడం మొదలైంది. అయినా ఆ మనిషి తనను గురించి చెప్పుకోవడం ఆపలేదు. ఇక భరించలేక, పిశాచాలు అదృశ్యమైపోయి, వాటి నివాసమైన మర్రిచెట్టును చేరాయి.

''అయ్యోబాబూ, ఏం మనిషి ! తల వాచేలా చేశాడు,'' అన్నది కుర్రపిశాచి.

అందుకు వృద్ధపిశాచం నవ్వి, ''తల వాస్తే వాచిందిగానీ, మన సందేహం తీరి పోయింది,'' అన్నది.

కుర్రపిశాచం అర్థం కానట్టు చూసింది.

వృద్ధపిశాచం తాపీగా చెట్టు కొమ్మకు జారగిలపడి, ''చూశావా, అన్నిటికన్నా పెద్దబలహీనత, తనను తాను పొగుడు కోవడం. ఒక మనిషికి ఏ దుర్గుణాలూ లేకపోవచ్చుగానీ, తనను తాను పొగుడు కోవడం, అనే బలహీనత వుంటే, యిక అతడి సుగుణాలకు విలువ వుండదు. ఒకడి సుగుణాలను యితరులు గ్రహించాలి తప్ప, తానే పొగుడుకోకూడదు, అనే ఆలోచన లేకపోవడంవల్ల, నలుగురిలో చులకన అవుతూంటారు. ఇంతెందుకు—ఎప్పుడూ మనుషుల్ని ఏడిపించే మనల్నే, ఏడిపించాడీమనిషి !'' అన్నది.

వృద్ధపిశాచం చెప్పినదానికి, కుర్రపిశాచం అవునన్నట్టు తలాడించింది.





# కృష్ణావతారం

ఒకనాటి రాత్రి కృష్ణుడు తన తండ్రి ఇంట ఉండి ఒక ఆలోచన చేశాడు. తన వారికి వైభవోపేతమైన ద్వారకానగరం ఏర్పడింది. కాని వారికి జీవనం సుఖప్రదంగా జరిగే ఒనరు ఏర్పడలేదు. అందుచేత అతను శంఖనిధిని తలుచుకున్నాడు. వెంటనే శంఖనిధి ప్రత్యక్షమై, చేతులు మోడ్చి నమస్కరించి, ''స్వామీ, ఎందుకు నన్ను స్మరించావు? నీ ఆజ్ఞ ఏమిటో తెలిస్తే నిర్వర్తిస్తాను,'' అన్నది.

''నిధిదేవతా, దరిద్రుడు చచ్చినవాడితో సమానం. నా వారిలో దీనులూ, అనాధులూ, ఆర్తులూ ఉండగా చూసి సహించలేను. అన్ని ఇళ్ళలోనూ సంపత్సమృద్ధి ఉండేటట్టు చూడు,'' అన్నాడు కృష్ణుడు.

''చిత్తం,'' అని శంఖనిధి వెళ్ళి మిగిలిన ఎనిమిది నిధులనూ కలుసుకుని, కృష్ణుడి కోరిక తెలిపింది. వెంటనే ద్వారక అంతటా నవనిధులూ వెలిశాయి. ఆ నగరంలో పేదవాడంటూ లేకుండా పోయాడు.

ఇదే విధంగా కృష్ణుడు మరొకసారి వాయుదేవుణ్ణి స్మరించాడు. వాయుదేవుడు వచ్చి కృష్ణుడికి నమస్కరించి నిలబడ్డాడు.

''వాయుదేవుడా, బలంలో నీకు చాలినవాడు ఎవడూ లేడు. నాకొక పని చేసిపెట్టాలి. అదేమిటంటే: ఇంద్రుడికి విశ్వకర్మ సుధర్మ అనే సభ చేసి ఇచ్చాడు. మా యాదవులకు కూడలిగా ఒక మంచి సభ అవసరం. అందుచేత నువు ఇంద్రు

**16.** రుక్మిణీ వివాహప్రయత్నం



డితో నా ఆజ్ఞగా చెప్పి, అతని అనుమతి మీద మా కా సభ తెచ్చిపెట్టు," అన్నాడు కృష్ణుడు. వాయుదేవుడు సరేనని దేవలోకానికి వెళ్ళి, దేవతలతో కృష్ణుడి కోరిక చెప్పి, వారి అంగీకారంతో సుధర్మ అనే సభాభవనాన్ని తెచ్చి, కృష్ణుడికి అప్పగించి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా కృష్ణుడు సమస్త లోకాలలోనూ ఉన్న సర్వోత్తమమైన వస్తువులన్నీ తెప్పించి ద్వారకలో ఉంచాడు. కృష్ణుడు తాను పై నుండి పరిపాలన నడుపుతూ ఈ విధంగా ముఖ్య స్థానాలలో వారి వారిని నియమించాడు: రాజు ఉగ్రసేనుడు; కాశ్యపుడనే బ్రాహ్మణుడు పురోహితుడు; విక్రముడు మంత్రి; వివిధ రాజ్యాంగ శాఖలు నిర్వహించటానికి పదిమంది యాదవ ప్రముఖులు, మంచి మేధావులైన వృద్ధులు నియమించబడ్డారు; దారుకుడు కృష్ణుడికి సారథి; అస్త్రవిద్యలో ద్రోణాచార్యుడితో సమానుడనదగిన సాత్యకి సేనాధిపతి.

ఈ విధంగా ప్రజల జీవితాన్ని వ్యవస్థాపించిన మీదట ద్వారక భూలోక స్వర్గంలాగా, అత్యంత వైభవంగా విలసిల్లింది. రైవతుడికి రేవతి అనే చక్కని కుమార్తె ఉన్నది. ఆమెను బలరాముడు పెళ్ళాడాడు. ఆ తరవాత కృష్ణుడికి వివాహమయింది. అదొక కథ.

వింధ్య పర్వతానికి దక్షిణంగా విదర్భ దేశం ఉన్నది. అందులో కుండిన నగరాన్ని, భీష్మకుడనే రాజు పాలించేవాడు. ఆయనకు రుక్మి అనే కొడుకుండేవాడు. ఈ రుక్మి మేటి వీరుడు. అతను ద్రుముడనే రాజువద్ద అనేక అస్త్రాలూ, పరశురాముడి నుంచి బ్రహ్మాస్త్రమూ పొందాడు. అతనికి మొదటినుంచీ కృష్ణుడంటే ఎంతో మత్సరం ఉండేది.

ఆ రుక్మికి చెల్లెలు రుక్మిణి; గొప్ప తేజస్వతి, అసమాన సౌందర్యవతి. ఆమె అందం మూడు లోకాలలోనూ ప్రఖ్యాతి పొందినది. ఆమె గొప్పతనాన్ని మూడు

ముక్కలలో చెప్పవచ్చు: కృష్ణుడి ప్రేమకు పాత్రురాలయింది; మన్మధుడు ఆమె గర్భాన తిరిగి జన్మించాడు; మునీశ్వరులామెను దేవతగా పూజించారు. అంతకంటె ఇంకేం చెప్పాలి?



రుక్మిణిని గురించి తన ఆప్తులు చెప్పుకుంటూంటే కృష్ణుడు విన్నాడు. అదే విధంగా కృష్ణుణ్ణి గురించి నలుగురూ చెప్పుకుంటూంటే రుక్మిణి విన్నది. ఇద్దరి మనసులలోనూ ఒకరి మీద ఒకరికి అనురాగం పుట్టుకొచ్చింది. దాని ఫలితంగా ఇద్దరూ మన్మధావస్థలకు గురి అయి, వేదన అనుభవించారు.

''నేను వరించిన దాన్ని నాకు కాకుండా చెయ్యగలవాడు మూడు లోకాలలోనూ ఎవడున్నాడు?'' అన్న ధైర్యంతో ఉన్నాడు కృష్ణుడు. రుక్మిణి మనస్సులో కృష్ణుడి ఆలోచన తప్ప మరొక ఆలోచన లేకుండా పోయింది.

కాని రుక్మికి కృష్ణుడంటే బొత్తిగా పడదు. ''నందగోపుడి యింట పశువులను కాచిన వాడికీ నాకూ పంతేమిటి?'' అన్న ధీమాలో ఉన్నాడతను.

ఇలా ఉండగా, మగధ దేశంలోని గిరివ్రజపురం నుంచి జరాసంధుడు రుక్మిణిని శిశుపాలుడి కివ్వవలసిందని కబురు చేశాడు. శిశుపాలుడు జరాసంధుడి పెంపుడుకొడుకు. వాస్తవానికి అతని తండ్రి దమఘోషుడు. అతని తల్లి వసుదేవుడి తోబుట్టువైన శ్రుతశ్రవ. దమఘోషుడూ, జరాసంధుడూ జ్ఞాతులు. అందుచేత దమఘోషుడు, జరాసంధుడు కోరినమీదట తన నలుగురు కొడుకుల లోనూ పెద్దవాడైన శిశుపాలుణ్ణి అతడికి పెంపుడిచ్చాడు.

శిశుపాలుడికి సునీధుడనే పేరు కూడా ఉన్నది.

జరాసంధుడు శిశుపాలుడికి రుక్మిణి నిచ్చి పెళ్ళి చెయ్యమని కబురు చెయ్యగానే, రుక్మిణి తండ్రి అయిన భీష్మకుడు సరే నన్నాడు. నిజానికి భీష్మకుడి ఉద్దేశం



రుక్మిణిని కృష్ణుడికిస్తేనే బాగుంటుందని. కాని, రుక్మికి కృష్ణుడంటే ద్వేషమని ఆయనకు తెలుసు. రుక్మి తన చెల్లెలిని శిశుపాలుడికే ఇవ్వాలన్న ఉద్దేశం బయట పెట్టాడు. కొడుకుకు ఎదురు చెప్పటం ఇష్టంలేక భీష్మకుడు సరేనన్నాడు.

తన కోరిక ఈడేరినందుకు జరాసంధుడు సంతోషించి తన ఆప్తులైన రాజులందరికీ శుభలేఖలూ, ఆహ్వానాలూ పంపాడు. అంగ, వంగ, కళింగ, పౌండ్ర, పాండ్య, కాశి, కరూశ మొదలైన రాజులనేకమంది పెళ్ళికి బయలుదేరారు. శిశుపాలుడికి తోడుగా వచ్చిన వారిలో కరూశ రాజకుమారుడు పౌండ్రకవాసుదేవుడూ, ఏకలవ్యుడి కొడుకు వీర్యవంతుడనేవాడూ, దంతవక్త్రుడి కొడుకు సువక్రుడనేవాడూ, ఇంకా అనేకమంది ఇతర రాజకుమారులూ ఉన్నారు. ఈ బలగాన్ని అంతనూ వెంటబెట్టుకుని జరాసంధుడు కుండిననగరానికి వచ్చాడు.

రుక్మి అనేక రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ వెంటబెట్టుకుని ఎదురువచ్చి, జరాసంధుడికి స్వాగతం తెలిపి, సమస్త మర్యాదలూ జరిపి, వచ్చిన వారందరినీ విడుదులలో ఏర్పాటు చేశాడు.

ముహూర్తాలు పెట్టేవాళ్ళు వచ్చి, మర్నాడే లగ్నం ఉన్నదన్నారు. వెంటనే ఆ విషయం నగరమంతటా చాటింపు వేశారు. రాజులందరూ తమ తమ హోదాలకు తగినట్టుగా సేనలను అలంకరించారు. శిశుపాలుడు పెళ్ళికొడుకై తన తోటి రాజకుమారుల మధ్య ఉల్లాసంగా ఉన్నాడు.

ఇక్కడ ఇలా ఉంటే, అక్కడ ద్వారకకు నారదుడు వచ్చాడు. తెల్లని శరీరమూ, బంగారు రంగులో ధగధగా మెరిసే జుట్టు ముడీ, శరీరంమీద ధరించిన చర్మమూ, నెత్తిన నెమిలి ఈకల గొడుగూ, గాలి తాకుడుకు నాదం చేస్తున్న వీణా—ఈ అవతారాన్ని ద్వారకాపురవాసులు అతి వింతగా చూశారు.

నారదుడు వచ్చాడని లోపలికి కబురు రాగానే, ఉగ్రసేనుడూ, వాసుదేవుడూ, కృష్ణ బలరాములూ, మిగిలిన యాదవ ప్రముఖులూ ఎదురువచ్చి, నారదుణ్ణి సుధర్మ సభాభవనానికి తీసుకుపోయి, ఒక బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, అర్ఘ్య పాద్యాలిచ్చి సత్కరించారు.

కృష్ణుడు అందరినీ కూర్చోమని, తాను కూడా కూర్చుని, చేతులు జోడించి, "నువు క్షేమంగా ఉన్నావా, నారదా? లోకాలకూ, దేవతలకూ క్షేమమే కదా? లోకాలన్నీ స్వేచ్ఛగా సంచరించే నీకు తెలియని దేముంటుంది? ఒకటి మాత్రం నిజం, నీ రాకకు ఏదో ప్రయోజనం ఉంటుంది. మా యాదవ వంశానికి ఏదో మంచి చెయ్యటానికే నువు వచ్చి ఉండాలి. నీ రాకవల్ల మేము ధన్యులమైనామనటానికి ఎలాటి సందేహమూ లేదు," అన్నాడు.

కృష్ణుడు చేసిన స్తోత్రపాఠాలకు ప్రీతుడై నారదుడు ఇలా అన్నాడు:

"నువు తలచుకున్నంత మాత్రాన సమస్త ప్రాణులకూ క్షేమం కలుగుతుంది గదా, అన్ని యుగాలలోనూ నీ పాద సేవలోనే మునిగితేలే నాబోటి వాళ్ళ క్షేమం వేరే అడగాలా?"

ఇలా అని నారదుడు తన వీణను శ్రుతి చేసి, కృష్ణుడి సంతోషం కోసరం అత్యంత మధురంగా వాయించాడు; మీనావతారం దగ్గిర నుంచీ రామావతారం వరకూ గల





అప్పుడు కృష్ణుడు నారదుడి కేసి నవ్వుతూ చూసి, ''బాబూ, ఒక్కటి కూడా బీరు పోనివ్వకుండా నేను చేసిన పనులన్నీ ఏకరు పెట్టావు. చాలుగాని నువ్విప్పుడు వచ్చిన పని ఏమిటో చెబుతావా? నువు ఊరికే వచ్చేవాడివి కావు,'' అన్నాడు.

అందుకు నారదుడిలా చెప్ప నారంభించాడు:

''దక్షిణ సముద్రతీరాన గోకర్ణమనే మహా పుణ్యక్షేత్రం ఉన్నది. అక్కడ శంకరుడు దివ్యలింగరూపంలో ఉంటాడు. ఆ దేవుడిముందు వీణ వాయించి, సంకీర్తన చేసి, భక్తితో అర్చన చేసి, అక్కడినుంచి కదిలి కుబేరుణ్ణి చూద్దామని బయలుదేరాను. దారిలో కుండిన పురాన్ని ఏలే భీష్మకుణ్ణి చూశాను. అతను కూడా నన్ను చాలా గౌరవించి, సంతోష పెట్టాడు. అయితే, అక్కడ నాకు జరాసంధుడు మొదలుకుని భూమి మీద వుండే రాజు లందరూ కనపడ్డారు. వీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారని భీష్మకుణ్ణి అడిగాను. అడిగితే, తన కుమార్తెను రుక్మిణిని చేది దేశపు రాజైన శిశుపాలుడి కిచ్చి పెళ్ళి చేస్తూ అందరినీ అహ్వానించాననీ, రేపు ఉదయమే లగ్నమనీ చెప్పాడు. సరే, ఈ ముక్క నీచెవిని వేసి పోదామని వచ్చాను,'' అని, నారదుడింకా ఇలా అన్నాడు:

అవతార కథలను పాటలుగా పాడాడు. తరవాత కృష్ణుడి బాలక్రీడలూ, పరాక్రమాలూ, కాళియమర్దనమూ, గోవర్ధనోద్ధరణా, కంసవధా మొదలైనవి ప్రస్తుతించుతూ చక్కని పాటలు పాడాడు. ఆయన పాటలు విన్న వాళ్ళందరూ తన్మయత్వంలో మునిగిపోయారు. నారదుడు ఆ పాటలలో గొప్పగా కీర్తించిన కృష్ణుడు తమకు ఆత్మీయుడూ, నాయకుడూ అయినందుకు యాదవులందరూ ఎంతగానో గర్వపడ్డారు. నారదుడు పాట చాలించి, వీణ పక్కన పెట్టెయ్యగానే, ఏమేమి కబుర్లు చెబుతాడో వినాలని చాలా ఆతురతగా ఉన్నారు.

"నీ మనసులో ఆ రుక్మిణిని నువు కోరుకున్నావు. ఆ భీష్మకుడేమో ఆ పిల్లను నీ పగవాడికిచ్చి పెళ్ళి చేయ సంకల్పించాడు. ఈ పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోతుంది. ఇలాగే జరిగినట్టయితే నీకు ఎంత అపకీర్తో చూడు. అందుచేత ఏం చేస్తావంటే, ఉగ్రసేన మహారాజును వెంట బెట్టుకుని, సాత్యకినీ, మిగిలిన యోధులనూ, సేనలనూ తీసుకుని ఈ పూటే బయలుదేరు. అక్కడికి వెళ్ళి, అక్కడ చేరిన రాజుల మూకలను చావబాది, సంతోషంగా ఆ పిల్లను తెచ్చుకో. నీ దగ్గిర సుదర్శన చక్రం ఉండగా అసాధ్యమేమిటి? ఇంకో సంగతి చెబుతాను విను. నేను ఆకాశ మార్గాన అదృశ్యంగా ఉండి, ఆ రుక్మిణి లీలోద్యానంలో తన చెలికత్తెల మధ్య కూర్చుని కంట తడి పెట్టుకుంటూండటం చూశాను. నిన్నే తలుచుకోవటమూ, నిన్ను గురించే మాట్లాడటమూ, నిన్ను చూడటం కోసం అరాటపడటమూ తప్ప ఆ పిల్లకు మరో ప్రపంచమే ఉన్నట్టు లేదు. పాపం, ఆ పిల్ల స్థితి వర్ణనాతీతంగా ఉన్నది. నున్నటి చెక్కిళ్ళు వడిలిపోయి, కన్నీరుతో తడిసి ఉన్నాయి. మెడలో ఒంటి పేటహారం తప్ప లేదు. పాపిట చెదిరిపోయింది. జుట్టంతా రేగి ఉన్నది. ఊపిరి విడిచినప్పుడల్లా ప్రాణం పోతుందేమో నన్నట్టుగా తోస్తున్నది. శరీరం కంపించి పోతున్నది. చెలికత్తెలు ఎన్ని శైత్యోపచారాలు చేసినా ఏమీ ఫలితం లేకుండా ఉన్నది. వాళ్ళు నీ పేరు తప్ప మరెవరి పేరెత్తినా చచ్చిపోతానని చెలికత్తెలతో అంటున్నది. నిజంగా ఆమెను చూస్తే ఎంత కటికవాడికి కూడా గుండె కరిగిపోతుంది. సహజ కరుణాస్వభావుడివైన నువు ఏమాత్రమూ చూస్తూ ఊరుకోదగదు. పాపం, ఆ రుక్మిణి ప్రాణాలు ఎలాగైనా కాపాడు. కాపాడటం నీ వంటివాడికి ధర్మం. నేను వచ్చిన పని అయింది. ఇక నేను వెళ్ళివస్తాను."

ఈ మాట కాస్తా అని నారదుడు తన దారిన తాను వెళ్ళిపోయాడు.





# దొంగదొరికాడు!

కొమరయ్యా, చలపతీ అనే వాళ్ళు బాల్య స్నేహితులు. వాళ్ళు చిన్నతనంలోనే తమ గ్రామంవదలి, కోటగిరి అనే పెద్ద ఊరు చేరారు. అక్కడ కొమరయ్య కొబ్బరి కాయల దుకాణం పెట్టాడు. చలపతి, ఒక షావుకారు దగ్గిర గుమాస్తాగా చేరాడు.

ఒకనాటి మధ్యాహ్నంవేళ చలపతి, కొమరయ్య దుకాణానికి వచ్చి, "కొమరయ్యా, నీనుంచి ఒక సాయం కావాలి," అన్నాడు.

"ఏమిటది?" అని అడిగాడు కొమరయ్య.

"మరేంలేదు. నా భార్య ఆడపిల్లను ప్రసవించినట్టు కబురువచ్చింది. పిల్లను చూసేందుకు, మా అత్తవారి గ్రామం బయలుదేరాను. అయితే, అంతలో మరొక వార్త. మన గ్రామంవైపు వున్న ఏరు పొంగిందట. నన్ను చూసేందుకు వస్తున్న మా అమ్మా, నాన్నా యిక్కడికి ఎప్పుడు చేరతారో తెలియదు. ఒకవేళ, వాళ్ళు చీకటిపడివస్తే, ఇంటికి తాళంవేసి వుంటుంది గనక కష్టపడిపోతారు. ఈ రాత్రికి, మా ఇంట్లో పడుకో; నేను సూర్యోదయం వేళకు వచ్చేస్తాను," అంటూ చలపతి, కొమరయ్యకు తన ఇంటితాళం చెవి యిచ్చాడు.

"నువ్వు ఇంటి గురించి ఏమీ బెంగ పడకు. ఈ రాత్రి కొంచెం ముందుగానే భోజనంచేసి, మీ ఇంటికి వెళ్ళి పడుకుంటాను," అన్నాడు కొమరయ్య.

చలపతి వెళ్ళిపోయాడు. కొమరయ్య, ఆ రాత్రి ఇల్లు చేరేసరికి, అతడి భార్య మంచంలో ముసుగుపెట్టుకుని మూలుగుతున్నది. ఆమెకు విపరీతమైన జ్వరం!

కొమరయ్య వెంటనే వెళ్ళి, వైద్యుణ్ణి తీసుకువచ్చాడు. ఆయన ఏదో మాత్రలు

మాచిరాజు కామేశ్వరరావు

యిచ్చి, తెల్లవారేలోపల రోగిచేత, మూడు సార్లు మింగించమన్నాడు. కొమరయ్యకు చలపతి ఇంటి విషయం గుర్తుకు వచ్చింది. అయితే, భార్యను ఒంటరిగా వదిలివెళ్ళే పరిస్థితికాదు!

ఇప్పుడేం చేయాలి? అని ఆలోచిస్తున్న కొమరయ్యకు, చలపతి ఇంటికి ఎదురుగా వున్న ఇంట్లోకి, కొత్తగా అద్దెకు వచ్చిన ఆదిత్య అనే యువకుడు గుర్తుకు వచ్చాడు. అతను బ్రహ్మచారి.

కొమరయ్య, వెంటనే అతడి దగ్గరకు వెళ్ళి, సంగతి వివరంగా చెప్పి, ''నీకు యిబ్బంది కలిగిస్తున్నాను. ఈ రాత్రికి చలపతి ఇంట్లో పడుకోగలవా?'' అని అడిగాడు.

అందుకు ఆదిత్య నవ్వి, ''ఇరుగూ పొరుగూ అన్నాక, ఈమాత్రం సహాయపడక పోతే ఎలా!'' అంటూ కొమరయ్య నుంచి, చలపతి ఇంటి తాళంచెవి తీసుకున్నాడు.

మర్నాటి సూర్యోదయం వేళకు, కొమరయ్య భార్యకు జ్వరం తగ్గింది. ఆదిత్య నుంచి తాళంచెవి తీసుకుందామని, కొమరయ్య, చలపతి ఇంటికి వెళ్ళాడు. అతను తలుపు తట్టేసరికి, దగ్గరగా వేసి వున్న తలుపులు తెరుచుకున్నవి. లోపలి దృశ్యం చూసి నిర్ఘాంతపోయాడు, కొమరయ్య.

ఆదిత్య ఒక స్తంభానికి కట్టివేయబడి వున్నాడు. ఇల్లంతా చిందర వందరగా వున్నది. కొమరయ్య, ఆదిత్య నోట్లో కుక్క



వున్న గుడ్డలు తీసి, కట్లు విప్పాడు. ఆదిత్య ఒంట్లో ఏమాత్రం సత్తువలేనివాడిలా నేలమీద చతికిలబడిపోయాడు.

కొమరయ్య, అతణ్ణి, "ఏం జరిగింది?" అని అడిగాడు.

దానికి ఆదిత్య, "ఒక రాత్రివేళ తలుపు తట్టిన శబ్దం అయితే, చలపతిగారి తలిదండ్రులు వచ్చారేమో అని, తలుపు గడి తీశాను. చేత కత్తితో దొంగ ఒకడు లోపలికి వస్తూనే, కత్తిని నా గుండెలకు ఆనించి, స్తంభం దగ్గిరకు నడిపించి, నన్ను తాడుతో దానికి బిగించాడు. తర్వాత నేను అరవబోయేసరికి, నోట్లో గుడ్డలు కుక్కాడు. నేను భయంతోనూ, ఊపిరాడకా—అలా సొమ్మసిల్లిపోయాను," అని చెప్పాడు.

ఇది విన్న కొమరయ్యకు నోట మాట రాలేదు. దొంగ ఏం ఎత్తుకుపోయివుంటాడో అని, అతడు చూస్తూండగా, చలపతి లోపలికి వస్తూనే, "ఏం జరిగింది కొమరయ్యా?" అని అడిగాడు.

కొమరయ్య జవాబు చెప్పబోయేంతలో అతడు పక్కనున్న గదిలోకి పోయి, ఒక పెట్టె తెరిచి వుండడం చూసి, "ఐదు వందల రూపాయిలూ, వెండివస్తువులూ— అంతా దొంగలపాలయ్యింది!" అంటూ కళ్ళనీళ్ళతో బయటికి వచ్చాడు.

కొమరయ్య, అతడికి ఆదిత్యను చూపి, జరిగినదంతా చెప్పాడు. చలపతి అంతా విని, "ఇందులో మీ పొరబాటేమీలేదు. అంతా నా ప్రారబ్ధం!" అన్నాడు.





ఇది జరిగిననాటి నుంచీ, కొమరయ్య తప్పంతా తనదే అన్నట్టుగా బాధపడుతూ, తరచూ భార్యతో, "నా అజాగ్రత్తవల్లనే, డబ్బూ, వెండి వస్తువుల విలువా కలిపి, దాదాపు రెండువేల రూపాయిల చలపతి ఆస్తి దొంగపాలయింది. అతడికి ఏదో కొంత యిస్తే తప్ప, నాకు మనశ్శాంతి వుండదు!" అంటూండేవాడు.

ఇటువంటి సమయంలో, కొమరయ్యకు దూరపు బంధువైన జనార్దనం అనే అతను, ఆ ఊరికి రక్షకభటుల అధికారిగా వచ్చాడు. ఆ వచ్చిన రోజు రాత్రే, అతడు కొమరయ్య పిలవగా, అతడింటికి భోజనానికి రావడం జరిగింది. కొమరయ్య మాటల సందర్భంలో, చలపతి యింట జరిగిన దొంగతనం గురించి అతడికి చెప్పాడు.

జనార్దనం అంతా విని, "ఇంతకూ, ఆ ఆదిత్య అనే అతను నమ్మదగినవాడేనా ?" అని అడిగాడు.

"అతను కొత్తగా, చలపతి యింటి దాపులవున్న ఇంట్లోకి అద్దెకువచ్చాడు. అతడి మంచి చెడ్డల గురించి, నాకేం తెలియదు," అన్నాడు కొమరయ్య.

జనార్దనం ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ ఊరుకుని, "దొంగ, ఆదిత్యను తాడుతో స్తంభానికి కట్టివేశాడు గదా! దాని ముడి ముందువైపున వున్నదా లేక వెనకవైపున వున్నదా ?" అని ప్రశ్నించాడు.

కొమరయ్య వెంటనే, "నాకు బాగా గుర్తు ! తాడు ముడి సరిగ్గా ఆదిత్య పొట్ట మీద వున్నది," అన్నాడు.

ఆ జవాబుకు జనార్దనం నవ్వి, "ఇకనేం, దొంగ ఆదిత్యే ! వాడు తనను తాను స్తంభానికి కట్టుకున్నాడు గనకే, తాడుముడి ముందు వున్నది. దొంగ అయితే, వాడి చేతికి అందకుండా వెనక ముడి వేస్తాడు. ఇంకో సంగతేమంటే— దొంగ అయినవాడెవ్వడూ, ఒక మనిషిని స్తంభానికి కట్టి, ఇంటి తలుపులు దగ్గిరకు వేసి పోడు. బయటనుంచి గొళ్ళెం పెడతాడు," అని చెప్పాడు.

"అంతా బాగానే వున్నది. మరి, ఆదిత్య దొంగ అని రుజువు చేయడం ఎలా?" అని అడిగాడు కొమరయ్య.

జనార్దనం, అతడికి ఏం చేయాలో చెప్పి వెళ్ళిపోయాడు.

మర్నాడు కొమరయ్య, ఆదిత్యను కలుసుకుని, "చలపతి, తన ఇంట జరిగిన దొంగతనం గురించి, లోగడ కచేరీలో ఫిర్యాదు చేశాడు. రాత్రి గస్తీ తిరుగుతున్న రక్షకభటులకు, దొంగ ఒకడు దొరికాడు. కాని, వాడు పిచ్చివాడిలా ప్రవర్తిస్తున్నాడట. ఇది నటనేమో అని వాళ్ళ అనుమానం. నువ్వు కచేరికి వచ్చి, వాణ్ణి చూసి గుర్తుపట్టాలి," అన్నాడు.

కొమరయ్యతో కచేరీకి వెళ్లిన ఆదిత్య, అక్కడ పిచ్చి చూపులు చూస్తున్న మనిషిని చూస్తూనే, "వీడే, ఆ రాత్రి కత్తి చూపి నన్ను స్తంభానికి కట్టి, చలపతిగారిల్లు దోచుకున్న దొంగ. ఎలాగైతేనేం, దొంగ దొరికాడు!" అన్నాడు.

ఆ వెంటనే, పిచ్చివాడిలా నటిస్తున్న జనార్దనం, ఒక్క దూకున వచ్చి, ఆదిత్య మెడ వడిసి పట్టుకుని, "దొంగ దొరికిన మాట నిజం. అయితే, ఆ దొంగవు నువ్వే! తేళ్ళూ, జెర్రులూ పాకే చీకటి కొట్లో వేయమన్నావా? లేక నిజం ఒప్పుకుని దొంగిలించిన సొమ్ము తెచ్చియిస్తావా?" అన్నాడు.

ఆదిత్య నిలువెల్లా వణికిపోతూ, నేరం ఒప్పుకున్నాడు. ఒక రక్షకభటుడు వెంట రాగా, ఇంటికిపోయి దొంగిలించిన సొమ్ముతో కచేరికి తిరిగి వచ్చాడు. అయితే, వెండివస్తువులన్నీ అలాగే వున్నవి కాని, ఐదువందల రూపాయిల నగదులో వంద రూపాయిలు ఖర్చయిపోయినై.

జనార్దనం అతణ్ణి కటకటాలకు వెనక వున్న గదిలో వుంచమని రక్షకభటులకు చెప్పి, చలపతికి కబురు చేశాడు.

చలపతి పోయిన సొమ్ము దొరికినందుకు చాలా సంతోషించి, "ఇదంతా, మా అమ్మాయి పుట్టిన వేళా విశేషం!" అన్నాడు.





# మూడు రాగి డబ్బులు

ఒక నగరంలో చాంగ్ అనే పొగాకు అమ్ముకునేవాడుండేవాడు. కావడిబద్దకు రెండు చివరలా వెదురు తట్టలు కట్టి, వాటిలో పొగాకు పెట్టుకుని, వీధులవెంట కేకలు పెడుతూ తిరిగి అమ్ముకునేవాడు. జనసమ్మర్దమైన వీధులకుండా తిరుగుతూ చాంగ్ చాలా శ్రమపడి తన వృత్తి సాగించుకోవలిసి వచ్చేది. అతను అమ్మే సరుకు సందులలోనూ, గొందులలోనూ అమ్ముడయేది కాదాయె.

ఒకనాటి ఉదయం చాంగ్ కావడి భుజాన వేసుకుని, జనాన్ని తోసుకుంటూ పోతూ ఉండగా, చింకి దుస్తులు ధరించి ఉన్న ఒక వృద్ధుడు అతన్ని భుజం తట్టి ఆపి, ''బాబూ, నా చిలుము నిండా పొగాకు నించుతావా ?'' అని అడిగాడు.

చాంగ్ అటూ ఇటూ చూశాడు. కావడి దించటానికి అవకాశం కనిపించలేదు. ముసలివాడు మూడు రాగి డబ్బులు చూపాడు. నిజానికి చిలుము నిండే పొగాకుకు అది పెద్ద ధరే.

''ఈ రద్దీలో కావడి దించటం నావల్ల కాదు. నీ చిలుము నువే నింపుకో తాతా,'' అన్నాడు చాంగ్.

ముసలివాడు తన బొటనవేలూ, చూపుడువేలూ ఉపయోగించి మూడుపట్లు తీసి చిలుములో జాగ్రత్తగా కూరాడు. ఆ కాస్త చిలుములో అంత పొగాకు పట్టినందుకు చాంగ్ ఆశ్చర్యపోయాడు. అయితే, చిలుము ఇంకా నిండనే లేదు. వృద్ధుడు తట్టలో ఉన్న పొగాకంతా ఆ చిలుములోకి ఎలాగో పట్టించాడు.

చాంగ్ నోటమాట లేక, మోసం జరిగినందుకు ఎంతగానో బాధపడుతూ, ఖాళీ అయిపోతున్న పొగాకు తట్టనూ, వృద్ధుణ్ణీ చూస్తూ రాయిలా ఉండిపోయాడు.

చీనా జానపద కథ

వృద్ధుడు చాంగ్ దగ్గరవున్న పాగాకంతా ఖాళీ చేసేసి, మూడు రాగిడబ్బులూ చాంగ్ తట్టలో పెట్టి, చిలుము అంటించుకుని, జనంలో కలిసిపోయాడు. హతాశుడైన చాంగ్ చిరాకుపడుతూ ఇంటికి బయలుదేరాడు.

దారిలో అతనికి కావడి బరువెక్కుతున్నట్టనిపించింది. "గిట్టుబాటు కాని బేరం బరువు చేటంటారు," అనుకున్నాడు చాంగ్. కాని నిజంగానే వెనక ఉన్న తట్ట క్రమక్రమంగా చాలా బరువెక్కి, చాంగ్ తన కావడిని వీధికి ఒక పక్కగా దింపుకోవలిసి వచ్చింది.

కావడి దింపి చూసేసరికి వెనక తట్ట నిండా రాగి డబ్బు లున్నాయి. చాంగ్ చూస్తుండగానే వాటి సంఖ్య పెరుగుతున్నది! అతను చప్పున ఆ తట్టను రెండు చేతులా పట్టుకుని, కావడితో సహా సాధ్యమైనంత త్వరలో ఇంటికి వచ్చి పడ్డాడు.

అతను గడప తగిలి బోర్ల పడేసరికి, రాగిడబ్బులన్నీ చిందరవందరగా నేల మీద పడ్డాయి. సరిగా ఊపిరి కూడా ఆడని స్థితిలో అతను వాటి నన్నిటినీ పోగు చేసి తన కొయ్యపెట్టెలో పోసి, మూత వేసేశాడు.

తరవాత అతను ఇంటి బయటికి వచ్చి తాపీగా గాలి పీల్చుకుంటూ, జరిగినదాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు. కొద్దిసేపట్లోనే లోపలి నుంచి కంగ్ అని



మోత వినిపించింది. అతను లోపలికి వెళ్ళి చూసేసరికి డబ్బు పెట్టె మూత పైకి లేచి ఉన్నది. పెట్టె పూర్తిగా నిండి దాని నుంచి రాగి డబ్బులు కింద పడుతున్నాయి. వాటి సంఖ్య ఇంకా పెరుగుతూనే ఉన్నది!

చాంగ్ ముక్కు గోక్కుని ఆలోచనలో పడ్డాడు. చివర కతను ఒక వడ్ల గాదె తెచ్చి, రాగి డబ్బులు అందులో పోశాడు. ఆ గాదె నిండింది. సాయంకాలం లోపల మూడు గాదెలు నిండాయి. కొంతసేపు కూడా తీరిక లేకుండా ఆ రోజు చాంగ్‌కు చేతినిండా పని.

చాంగ్ పూర్తిగా సంతుష్టి చెందాడు. తాను ఇప్పుడు ధనికుడు. వీధుల వెంట తిరిగి పాగాకు అమ్ముకోనవసరం లేదు. అతను తనఖా వ్యాపారం చేయ నిశ్చయించాడు. దర్జాగా దుకాణంలో కూర్చుని తాకట్ల మీద జనానికి అప్పులివ్వటం తప్ప, తాను ఇంకే విధమైన శరీరకష్టం చేయనవసరం లేదు!

అతను తనఖా వ్యాపారం ప్రారంభించాడు. అది బాగా కలిసి వచ్చింది. కాని చిత్ర మేమిటంటే అతని ఖజానా పెట్టెలో రాగి డబ్బులింకా పెరుగుతూనే ఉన్నాయి. అందులో నుంచి ఎంత డబ్బు తీసినా తరుగు కనిపించటం లేదు. పెరుగుతూనే వున్నాయి.

ఇలా ఉండగా ఒకనాడు అతని దుకాణానికి ఎవరో ఒక ముసలివాడు వచ్చి తన దగ్గరున్న కొన్ని వస్తువులు అతనికి అమ్మ జూపాడు. అవి ఏమంత విలువ గలవి కావు.

చాంగ్ వాటిని కొంతసేపు అటూ ఇటూ తిప్పి చూసి, "వీటికి ఏమియ్యమంటావు?" అని అడిగాడు.

ముసలివాడు తడువుకోకుండా, "మూడు రాగిడబ్బులియ్యి," అన్నాడు.

చాంగ్ ముసలివాడికి మూడు రాగి డబ్బులూ ఇచ్చేశాడు. అటు పిమ్మట చాంగ్ పెట్టెలో రాగి పెరగటం మానేసింది.





# నూలువడకలేని భార్య

ఒక నగరంలో ఒక సంపన్నుల ఇంట ఒక అందమైన అమ్మాయి ఉండేది. అదృష్టవశాత్తూ ఆమెకు మంచి సంబంధమే కుదిరింది. వరుడు పొరుగు సీమవాడైనప్పటికీ ధనికుడు, అందగాడు. పిల్లకు యువకుడూ, యువకుడికి పిల్లా నచ్చారు. అందుచేత వారిద్దరికీ సలక్షణంగా పెళ్ళి చేసి తల్లిదండ్రులు పిల్లను భర్తవెంట అత్తవారింటికి పంపారు.

కొద్దినెలలు భార్యా భర్తలు సుఖంగా కాపరం చేసినాక, భర్త ఒకనాడు ఒక రాట్నమూ, బుట్టెడు ఏకులూ తెచ్చి భార్య ముందు పెట్టి, "రోజూ నూలు వడుకు! దారం సన్నగా ఉండాలి, పురి సమంగా ఉండాలి," అన్నాడు.

భార్య తెల్లమొహం వేసి, "ఏమిటిది? నేను రోజూ రాట్నం మీద నూలు వడకాలా?" అ ్నది.

"అవును. నాకు ఏటా కావలిసిన రెండు జతల ధోవతులూ, కండువాలూ నువు వడికిన నూలుతోనే నేయించుకుంటాను," అన్నాడు భర్త.

"నాకు నూలు వడకటం చేతకాదు!" అన్నది భార్య.

పనిమంతురాలైన ఆడదానికి నూలు వడకటం రాదంటే భర్త నమ్మలేదు; సోమరితనంకొద్దీ తన భార్య ఆ విధంగా తనతో బొంకుతున్నదనుకున్నాడు.

"చాల్లే, పిచ్చిమాటలు చెప్పక, రోజుకు ఆరు విచ్చుల నూలు తీసి మరీ నాకు చూపించాలి, తెలిసిందా!" అంటూ భర్త బయటికి వెళ్ళిపోయాడు.

పుట్టెడు దిగులుతో భార్య రాట్నం ముందు కూచుని, నూలు తీయ యత్నించింది. కాని ఆమెకు అభ్యాసం లేకపోవటం చేత మాటిమాటికి నూలు తెగిపోతూ ఆ



నూలు ఒకచోట మందంగా, ఒకచోట సన్నగా పురి లేకుండా, మరొకచోట ఉండలు ఉండలుగా వచ్చింది.

ఆ రోజు సాయంత్రం భర్త పొలాన్నుంచి ఇంటికి వచ్చేసరికి ఆమె ఒక విచ్చ కూడా తీయలేదు.

భర్త ఆ దారం చూస్తూనే, భార్య మీద మండిపడ్డాడు.

''వేళాకోళమా? ఇలా చేశావంటే నిన్ను వదిలేసి బుద్ధిగా నూలు వడికేదాన్ని చేసుకుంటాను. ఏమనుకున్నావో! రేపు ఉదయమే నేను పనిమీద పట్నం పోతున్నాను. మళ్ళీ పది రోజుల్లో వస్తాను. ఈలోపుగా బుట్టెడు ఏకులూ దారం తీసి ఉంచాలి. అలా చెయ్యకపోయావో నేను అన్నంతపనీ చేస్తాను!'' అన్నాడు భర్త భార్యతో.

భార్యకు పుట్టెడు దిగులు పట్టుకున్నది. తన పుట్టింట రాట్నమే లేదు. అందుచేత ఆమె ఎన్నడూ దారం తీసిన పాపాన పోలేదు. తన భర్త ఉండే సీమలో ప్రతి ఆడదీ దారం తీస్తుంది. అందుచేత ఇక్కడి వారు దారం తీయలేని స్త్రీలను గౌరవించరు. తన భర్త వెళ్ళిపోయినాక భార్య విచారంతో వెళ్ళి తమ ఇంటి పక్కన ఉండే మైదానంలో ఒక పెద్ద బండరాతి పైన కూచున్నది.

కొంతసేపటికి ఆమెకు ఎక్కడి నుంచో చిన్నగా మాటల సవ్వడీ, నవ్వులూ వినిపించాయి. చుట్టూ చూస్తే ఎక్కడా జనం పొడలేదు. చుట్టుపక్కల శ్రద్ధగా ఆలకించగా ఆ మాటలూ, నవ్వులూ తాను కూచున్న రాతికింది నుంచి వస్తున్నట్టు తోచింది.

భార్య రాతిపైనుంచి లేచి అతి కష్టం మీద ఆ రాతిని పక్కకు తోసింది. దాని కింద తాను పట్టేపాటి బిలం కనిపించింది. ఆమె ఆ బిలంలోకి వెళ్ళింది. లోపల విశాలమైన గదిలాటిది ఉన్నది. ఆ గదిలో ఆరుగురు మరుగుజ్జులైన స్త్రీలున్నారు. వారు చూడటానికి అయిదారేళ్ళ ఆడపిల్ల

లంతే ఉన్నారు. అందరి ముందూ బొమ్మ రాట్నాలున్నాయి. ఆ స్త్రీలు వాటిని వాయువేగంతో తిప్పుతూ, క్షణానికొక ఏకుచొప్పున తీసుకుని సాలెగూడు దారంలాటి దారాన్ని తీసి, ఒక పక్కగా పోగు వేస్తున్నారు. వాళ్ళను చూస్తూనే భార్య ఆశ్చర్యపోయింది.

ఆ ఆరుగురి మూతులూ ఒక పక్కకు తోసుకుపోయి ఉండటం భార్య గమనించింది. వారు అంత వేగంతో దారం తీస్తూ కూడా తమలో తాము మాట్లాడుకుంటున్నారు. వంకరమూతులతో పెద్దగా నవ్వుతున్నారు.

భార్య వారిని పలకరించి, ''అమ్మా, మీరెవరో నేనెరగను, కాని మీరు ఎంతో సులభంగా దారం తీసేపద్ధతి చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది. మీకున్న శక్తిలో నాకు నూరోవంతు ఉన్నా నాకీ విచారం లేకపోను!'' అంటూ, భర్త పట్నం వెళ్ళేముందు తనతో అన్న మాటలు తలుచుకుని బావురుమన్నది.

ఆ ఆరుగురు స్త్రీలూ రాట్నాలు తిప్పటం మానేసి, ''ఏమిటమ్మా నీకు వచ్చిన కష్టం?'' అని అడిగారు.

ఆమె వారితో తన భర్త పెట్టిన నియమం గురించి చెప్పి, ''మావారు ఇంటికి వచ్చేసరికి ఈ బుట్టెడు ఏకులూ నూలుతీసి ఉంటేనేగాని నా పరువు దక్కదు. తరవాత సంగతి దేవుడెరుగు!'' అన్నది విచారంగా.



ఆ స్త్రీలు నవ్వి, "ఈ మాత్రానికి విచారం దేనికమ్మా? మేము ఏకులు వడికిపెడతాంలే. నీ భర్త వచ్చే రోజు ఉదయం మమ్మల్ని కేక వేశావంటే మేము వచ్చి కొద్ది నిమిషాలలో నీ పని పూర్తి చేస్తాం. మాకుమాత్రం ఒక పూట మీ యింట ఇంత భోజనం పెట్టు, చాలు!" అన్నారు.

భార్య అలాగే చేసింది. భర్త వచ్చే రోజు ఆ స్త్రీలు వచ్చి అతి సన్నని దారం తీసి ఇంత ఎత్తున పోగు వేశారు.

భర్త వచ్చాడు. మూతి వంకర స్త్రీలను చూసి భార్యతో, "వీరెవరు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"మన పొరుగువాళ్ళే. నాకు తోడుగా వచ్చారు. భోజనం చేసి మరీ వెళ్ళమన్నాను!" అన్నది భార్య.

తరవాత కాస్సేపటికి అందరూ భోజనాలకు కూచున్నారు. ఆ స్త్రీలు మాట్లాడినా, నవ్వినా మూతి ఒక పక్కకు తోసుకుపోతూండటం గమనించి భర్త, వాళ్ళను, "ఏమమ్మా, మీ అందరి మూతులూ అలా ఒక పక్కకు తోసుకుపోయాయి. అది మీ పుటకతీరా లేక అందుకు వేరే ప్రత్యేకమైన కారణం ఏదైనా ఉన్నదా!" అని అడిగాడు.

"ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకోబోయేదాకా నూలు వడికీ, వడికీ, వడికీ మా మూతులు వంకరపోయాయి, నాయనా! అంతకన్న వేరే కారణం ఏమీ లేదు!" అన్నారు ఆ స్త్రీలు.

వారు వెళ్ళిపోయాక, భర్త భార్య మొహాన్ని పరీక్షగా చూశాడు. ఆమెది అందమైన మొహం. అందులోనూ మూతి చక్కగా తీర్చి దిద్దినట్టున్నది.

"ఏమే, ఇదివరకు, ఏం వడికావో వడికావు, ఇకముందు నువు రాట్నం ముందు కూచోవటానికి వీల్లేదు! అంతే!" అంటూ భర్త రాట్నాన్ని అటకమీదికి ఎక్కించేశాడు.

భార్య బతుకుజీవుడా అనుకుని ఒక్క నిట్టూర్పు విడిచింది.



## ప్రకృతి వింతలు:




మాస్కరీన్ దీవులలోని (రాఫియా పామ్) తాళవృక్షాలకూ, అమెజాన్ ప్రాంత వెదురుజాతి తాళవృక్షాలకూ (బాంబూపామ్) పెద్ద పెద్ద ఆకులు ఉన్నాయి. ఒక్కొక్క ఆకు పొడవు దాదాపు 65 అడుగులవరకూ వుంటుంది.

### కాపలా బాధ్యత!

పందికొక్కు జాతికి చెందిన 'మెర్మాట్స్' జంతువులు, ఎప్పుడూ ఒక కావలా కలిగి వుంటాయి. తమను వేటాడదానికి జంతువు గాని, పక్షిగాని వస్తున్నదని తెలియగానే కావలాకాసే 'మేర్మాట్' గట్టిగా ఈల వేస్తుంది. ఈల విన్న వెంటనే మిగతా మెర్మాట్స్ బొరియలలోకి వెళ్ళి పోతాయి. అపాయం తొలగిందని తెలియగానే కావలాకాసే మెర్మాట్ మళ్ళీ ఈల వేస్తుంది।



గత 600 మిలియన్ సంవత్సరాలలో దాదాపు 2000 సార్లు భూమి—లఘుగ్రహ (ఆస్టెరాయిడ్) ఘర్షణలు జరిగినట్టు చెబుతారు।



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మహాత్ములకు నా వందనాలు! రెండవ ఫోటో: శాంతి, అహింసలే నా సాధనాలు!!

పంపినవారు: కె. బాలాజీవిఠల్, సత్యన్నారాయణపురం, విజయవాడ–520 011 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008



Nestlé

సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

